గృహాన్వారోహయేద్యదవక్షాణాన్యసం ప్రక్షాప్య ప్రయాయాద్యథా యజ్ఞవేశసం వాఽఽదహనం వా తాదృగేవ తదయం తే యోనిర్‌ఋత్వియ ఇత్యరణ్యోః సమారోహయ-
[౩౯] త్యేష వా అగ్నేర్యోనిః స్వ ఏవైనం యోనౌ సమారోహయత్యథో ఖల్వాహుర్యదరణ్యోః సమారూఢో నశ్యేదుదస్యాఽగ్నిః సీదేత్పునరాధేయః స్యాదితి యా తే అగ్నే యజ్ఞియా తనూస్తయేహ్యా రోహేత్యాత్మన్థ్సమారోహయతే యజమానో వా అగ్నేర్యోనిః స్వాయామేవైనం యోన్యాగ్ం సమారోహయతే॥[౪౦]

*ధత్తేఽర్వాచీనగ్గ్ స్వాథ్సమారోహయతి పఞ్చచత్వారిగ్ంశచ్చ॥***3.4.10**॥

త్వమగ్నే బృహద్వయో దధాసి దేవ దాశుషే। కవిర్గృహపతిర్యువా॥ హవ్యవాడగ్నిరజరః పితా నో విభుర్విభావా సుదృశీకో అస్మే। సుగార్‌హపత్యాః సమిషో దిదీహ్యస్మద్రియక్సం మిమీహి శ్రవాగ్ంసి॥ త్వం చ సోమ నో వశో జీవాతుం న మరామహే। ప్రియస్తోత్రో వనస్పతిః॥ బ్రహ్మా దేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్। శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమః [౪౧] పవిత్రమత్యేతి రేభన్న్॥ ఆ విశ్వదేవగ్ం సత్పతిగ్ం సూక్తైరద్యా వృణీమహే। సత్యసవగ్ం సవితారమ్॥ ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ। హిరణ్యయేన సవితా రథేనాఽఽ దేవో యాతి భువనా విపశ్యన్న్॥ యథా నో అదితిః కరత్పశ్వే నృభ్యో యథా గవే। యథా తోకాయ రుద్రియమ్॥ మా నస్తోకే తనయే మా న ఆయుషి మా నో గోషు మా [౪౨] నో అశ్వేషు రీరిషః। వీరాన్మా నో రుద్ర భామితో వధీర్‌హవిష్మన్తో నమసా విధేమ తే॥ ఉదప్రుతో న వయో రక్షమాణా వావదతో అభ్రియస్యేవ ఘోషాః। గిరిభ్రజో నోర్మయో మదన్తో బృహస్పతిమభ్యర్కా అనావన్న్॥ హగ్ంసైరివ సఖిభిర్వావదద్భిరశ్మన్మయాని నహనా వ్యస్యన్న్। బృహస్పతిరభికనిక్రదద్గా ఉత ప్రాస్తౌదుచ్చ విద్వాగ్ం అగాయత్॥ ఏన్ద్ర సానసిగ్ం రయిగ్ం
[౪౩] సజిత్వానగ్ం సదాసహమ్। వర్‌షిష్ఠమూతయే భర॥ ప్ర ససాహిషే పురుహూత

శత్రూ॒షాళ్జ్యేష్ఠస్తే శుష్మ ఇహ రా॒తిర॑స్తు। ఇన్ద్రాఽఽ భ॑ర॒ దక్షి॑ణేనా॒ వసూ॑ని॒ పతిః॒ సిన్ధూ॑నామసి రే॒వతీ॑నామ్॥ త్వగం॑ సు॒తస్య॑ పీ॒తయే॑ స॒ద్యో వృ॒ద్ధో అ॑జాయథాః। ఇన్ద్ర॒ జ్యైష్ఠ్యా॑య సుక్రతో॥ భువ॒స్త్వమి॑న్ద్ర॒ బ్రహ్మ॑ణా మ॒హాన్భువో॒ విశ్వే॑షు॒ సవ॑నేషు య॒జ్ఞియః॑। భువో॒ నౄగ్శ్చ్యౌ॒త్నో విశ్వ॑స్మి॒న్భరే॒ జ్యేష్ఠ॑శ్చ॒ మన్త్రో॑ [౪౪] విశ్వచర్షణే॥ మి॒త్రస్య॑ చర్షణీ॒ధృతః॒ శ్రవో॑ దే॒వస్య॑ సాన॒సిమ్। స॒త్యం చి॒త్రశ్ర॑వస్తమమ్॥ మి॒త్రో జనా॑న్ యాతయతి ప్రజా॒నన్మి॒త్రో దా॑ధార పృథి॒వీము॒త ద్యామ్। మి॒త్రః కృ॒ష్టీరని॑మిషా॒ఽభి చ॑ష్టే స॒త్యాయ॑ హ॒వ్యం ఘృ॒తవ॑ద్విధేమ॥ ప్ర స మి॑త్ర॒ మర్తో॑ అస్తు॒ ప్రయ॑స్వా॒న్ యస్త॑ ఆదిత్య॒ శిక్ష॑తి వ్ర॒తేన॑। న హ॑న్యతే॒ న జీ॑యతే॒ త్వోతో॒ నైన॒మగం॒హో అ॑శ్నో॒త్యన్తి॑తో॒ న దూ॒రాత్॥ య- [౪౫] చ్చి॒ద్ధి తే॒ విశో॑ య॒థా ప్ర దే॑వ వరుణ వ్ర॒తమ్। మి॒మీ॒మసి॒ ద్యవి॑ద్యవి॥ యత్కిం చే॒దం వ॑రుణ॒ దైవ్యే॒ జనే॑ఽభిద్రో॒హం మ॑ను॒ష్యా॑శ్చరా॑మసి। అచి॑త్తీ॒ యత్తవ॒ ధర్మా॑ యుయోపి॒మ మా న॒స్తస్మా॒దేన॑సో దేవ రీరిషః॥ కి॒త॒వాసో॒ యద్రి॑రి॒పుర్న దీ॒వి యద్వా॑ ఘా స॒త్యము॒త యన్న వి॒ద్మ। సర్వా॒ తా వి ష్య॑ శిథి॒రేవ॑ దే॒వాఽథా॑ తే స్యామ వరుణ ప్రి॒యాసః॥[౪౬]

*సోమో॒ గోషు॒ మా ర॒యిం మన్త్రో॒ యచ్చి॒ద్ధిరా॒ సప్త॒ చ॥* ***3.4.11***||

*వి॒ వా ఏ॒తస్యా॒ ఽఽవా॒యో ఇ॒మేవై॒ చిత్తం॒ వాగ్నిర్భూ॒తానాం॒ దేవా॒ వా అ॒భ్యా॒తానా॒సృ॒తా॒షాడ్రా॒ష్ట్ర కామా॑య॒ దేవి॑కా వాస్తో॑ష్పతే॒ త్వమ॑గ్నే బృ॒హద్వ॒య ఏకాద॑శ*||***11***||

*వి॒వా ఏ॒తస్యే॒ త్యాహ మృ॒త్యుర్గ॑న్ధ॒ర్వోఽవ॑ రున్ధే॒ మధ్య॒తస్త్వమ॑గ్నే బృ॒హథ్షట్చ॑త్వారిగం॒శత్॥౪౬॥*

*వి॒వా ఏ॒తస్య॑ ప్రి॒యాసః॥*

॥ హరిః ఓమ్॥

॥ శ్రీ కృష్ణార్పణమస్తు॥

॥ ఇతి తృతీయకాణ్డే చతుర్థః ప్రశ్నః॥

# కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితా

## ॥ అథ తృతీయ కాణ్డే పఞ్చమః ప్రశ్నః॥

హరిః ఓమ్॥ పూర్ణా పశ్చాదుత పూర్ణా పురస్తాదున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ। తస్యాం దేవా అధి సంవసన్త ఉత్తమే నాక ఇహ మాదయన్తామ్॥ యత్తే దేవా అదధుర్భాగధేయమమావాస్యే సంవసన్తో మహిత్వా। సా నో యజ్ఞం పిపృహి విశ్వవారే రయిం నో ధేహి సుభగే సువీరమ్॥ నివేశనీ సఙ్గమనీ వసూనాం విశ్వా రూపాణి వసూన్యావేశయన్తీ। సహస్రపోషగ్ం సుభగా రరాణా సా న ఆ గన్వర్చసా [1] సంవిదానా॥ అగ్నీషోమౌ ప్రథమౌ వీర్యేణ వసూన్రుద్రానాదిత్యానిహ జిన్వతమ్। మాధ్యగ్ం హి పౌర్ణమాసం జుషేథాం బ్రహ్మణా వృద్ధౌ సుకృతేన సాతావథాఽస్మభ్యగ్ం సహవీరాగ్ం రయిం ని యచ్ఛతమ్॥ ఆదిత్యాశ్చాఽఙ్గిరసశ్చాఽగ్నీనాఽదధత తే దర్శపూర్ణమాసౌ ప్రైప్సన్తేషామఙ్గిరసాం నిరుప్తగ్ం హవిరాసీదథాఽఽదిత్యా ఏతౌ హోమావపశ్యన్తావజుహవుస్తతో వై తే దర్శపూర్ణమాసౌ [2] పూర్వ ఆఽలభన్త దర్శపూర్ణమాసావాలభమాన ఏతౌ హోమౌ పురస్తాజ్జుహుయాత్సాక్షాదేవ దర్శపూర్ణమాసావా లభతే బ్రహ్మవాదినో వదన్తి స త్వై దర్శపూర్ణమాసావా లభేత య ఏనయోరనులోమం చ ప్రతిలోమం చ విద్యాదిత్యమావాస్యాయా ఊర్ధ్వం తదనులోమం పౌర్ణమాస్యై ప్రతీచీనం తత్ప్రతిలోమం యత్పౌర్ణమాసీం పూర్వామాలభేత ప్రతిలోమమేనావా లభేతాఽముమపక్షీయమాణమన్వప [3] క్షీయేత సారస్వతౌ హోమౌ పురస్తాజ్జుహుయాదమావాస్యా వై సరస్వత్యనులోమమేవైనావా లభతేఽముమాప్యాయమానమన్వా ప్యాయత ఆగ్నావైష్ణవమేకాదశకపాలం పురస్తాన్నిర్వపేత్సరస్వత్యై చరుగ్ం సరస్వతే ద్వాదశకపాలం యదాగ్నేయో భవత్యగ్నిర్వై

యజ్ఞముఖం యజ్ఞముఖమేవర్ధిం పురస్తాద్ధత్తే యద్వైష్ణవో భవతి యజ్ఞో వై విష్ణుర్యజ్ఞమేవారభ్య ప్ర తనుతే సరస్వత్యై చరుర్భవతి సరస్వతే ద్వాదశకపాలోఽమావాస్యా వై సరస్వతీ పూర్ణమాసః సరస్వాన్తావేవ సాక్షాదా రభత ఋధ్నోత్యాభ్యాం ద్వాదశకపాలః సరస్వతే భవతి మిథునత్వాయ ప్రజాత్యై మిథునౌ గావౌ దక్షిణా సమృద్ధ్యై ||౪||

*వర్చసా వై తే దర్శపూర్ణమాసావప తనుతే సరస్వత్యై పఞ్చవిగ్ంశతిశ్చ* **||3.5.1||**

ఋషయో వా ఇన్ద్రం ప్రత్యక్షం నాఽపశ్యన్తం వసిష్ఠః ప్రత్యక్షమపశ్యత్సోఽబ్రవీద్బ్రాహ్మణం తే వక్ష్యామి యథా త్వత్పురోహితాః ప్రజాః ప్రజనిష్యన్తేఽథ మేతరేభ్య ఋషిభ్యో మా ప్ర వోచ ఇతి తస్మా ఏతాన్త్స్తోమభాగానబ్రవీత్తతో వసిష్ఠపురోహితాః ప్రజాః ప్రాఽజాయన్త తస్మాద్వాసిష్ఠో బ్రహ్మా కార్యః ప్రైవ జాయతే రశ్మిరసి క్షయాయ త్వా క్షయం జిన్వ- [౫] త్యాహ దేవా వై క్షయో దేవేభ్య ఏవ యజ్ఞం ప్రాఽఽహ ప్రేతిరసి ధర్మాయ త్వా ధర్మం జిన్వేత్యాహ మనుష్యా వై ధర్మో మనుష్యేభ్య ఏవ యజ్ఞం ప్రాఽఽహాఽన్వితిరసి దివే త్వా దివం జిన్వేత్యాహైభ్య ఏవ లోకేభ్యో యజ్ఞం ప్రాఽఽహ విష్టం భోఽసి వృష్ట్యై త్వా వృష్టిం జిన్వేత్యాహ వృష్టిమేవాఽవ [౬] రున్ధే ప్రవాఽస్యనువాఽసీత్యాహ మిథునత్వాయోశిగసి వసుభ్యస్త్వా వసూఞ్జిన్వేత్యాహాఽష్టౌ వసవ ఏకాదశ రుద్రా ద్వాదశాఽఽదిత్యా ఏతావన్తో వై దేవాస్తేభ్య ఏవ యజ్ఞం ప్రాఽఽహౌజోఽసి పితృభ్యస్త్వా పితౄఞ్జిన్వేత్యాహ దేవానేవ పితౄనను సం తనోతి తన్తురసి ప్రజాభ్యస్త్వా ప్రజా జిన్వ- [౭] త్యాహ పితౄనేవ ప్రజా అను సం తనోతి పృతనాషాడసి పశుభ్యస్త్వా పశూఞ్జిన్వేత్యాహ ప్రజా ఏవ పశూనను సం తనోతి రేవదస్యోషధీభ్యస్త్వౌషధీర్జిన్వేత్యాహౌషధీష్వేవ పశూన్ప్రతి ష్ఠాపయత్యభిజిదసి యుక్తగ్రావేన్ద్రాయ త్వేన్ద్రం జిన్వేత్యాహాభిజిత్యా అధిపతిరసి ప్రాణాయ త్వా ప్రాణం [౮] జిన్వేత్యాహ ప్రజాస్వేవ ప్రాణాన్దధాతి త్రివృదసి ప్రవృదసీత్యాహ మిథునత్వాయ

సగ్ంరోహోఽసి నీరోహోఽసీత్యాహ ప్రజాత్యై వసుకోఽసి వేషశ్రిరసి వస్యష్టిరసీత్యాహ ప్రతిష్ఠిత్యై॥[౯]

*జిన్వేత్యేవ ప్రజా జిన్వ ప్రాణం త్రిగ్ంశచ్చ*||**3.5.2**||

అగ్నినా దేవేన పృతనా జయామి గాయత్రేణ ఛన్దసా త్రివృతా స్తోమేన రథన్తరేణ సామ్నా వషట్కారేణ వజ్రేణ పూర్వజాన్ భ్రాతృవ్యానధరాన్పాదయామ్యవైనాన్ బాధే ప్రత్యేనాన్నుదేఽస్మిన్ క్షయేఽస్మిన్భూమిలోకే యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మో విష్ణోః క్రమేణాఽత్యేనాన్ క్రామామీన్ద్రేణ దేవేన పృతనా జయామి త్రైష్టుభేన ఛన్దసా పఞ్చదశేన స్తోమేన బృహతా సామ్నా వషట్కారేణ వజ్రేణ [౧౦] సహజాన్విశ్వేభిర్దేవేభిః పృతనా జయామి జాగతేన ఛన్దసా సప్తదశేన స్తోమేన వామదేవ్యేన సామ్నా వషట్కారేణ వజ్రేణాఽపరజానిన్ద్రేణ సయుజో వయగ్ం సాసహ్యామ పృతన్యతః। ఘ్నన్తో వృత్రాణ్యప్రతి। యత్తే అగ్నే తేజస్తేనాఽహం తేజస్వీ భూయాసం యత్తే అగ్నే వర్చస్తేనాఽహం వర్చస్వీ భూయాసం యత్తే అగ్నే హరస్తేనాఽహగ్ం హరస్వీ భూయాసమ్॥[౧౧]

*బృహతా సామ్నా వషట్కారేణ వజ్రేణ షట్చత్వారిగ్ంశచ్చ*||**3.5.3**||

యే దేవా యజ్ఞహనో యజ్ఞముషః పృథివ్యామధ్యాసతే। అగ్నిర్మా తేభ్యో రక్షతు గచ్ఛేమ సుకృతో వయమ్॥ ఆఽగన్మ మిత్రావరుణా వరేణ్యా రాత్రీణాం భాగో యువయోర్యో అస్తి। నాకం గృహ్ణానాః సుకృతస్య లోకే తృతీయే పృష్ఠే అధి రోచనే దివః॥ యే దేవా యజ్ఞహనో యజ్ఞముషోఽన్తరిక్షేఽధ్యాసతే। వాయుర్మా తేభ్యో రక్షతు గచ్ఛేమ సుకృతో వయమ్॥ యాస్తే రాత్రీః సవిత- [౧౨] ర్దేవయానీరన్తరా ద్యావాపృథివీ వియన్తి। గృహైశ్చ సర్వైః ప్రజయాన్వగ్రే సువో రుహాణాస్తరతా రజాగ్ంసి॥ యే దేవా యజ్ఞహనో యజ్ఞముషో దివ్యధ్యాసతే। సూర్యో మా తేభ్యో రక్షతు గచ్ఛేమ సుకృతో వయమ్॥ యేనేన్ద్రాయ

సమభరః పయాగ్స్యుత్తమేన హవిషా జాతవేదః। తేనాఽగ్నే త్వముత వర్ధయేమగ్ం సజాతానాగ్ శ్రైష్ఠ్య ఆ ధేహ్యేనమ్॥ యజ్ఞహనో వై దేవా యజ్ఞముషః [౧౩] సన్తి త ఏషు లోకేష్వాసత ఆదదానా విమథ్నానా యో దదాతి యో యజతే తస్య। యే దేవా యజ్ఞహనః పృథివ్యామధ్యాసతే యే అన్తరిక్షే యే దివీత్యాహేమానేవ లోకాగ్ స్తీర్త్వా సగృహః సపశుః సువర్గం లోకమేత్యప వై సోమేనేజానాద్దేవతాశ్చ యజ్ఞశ్చ క్రామన్త్యాగ్నేయం పఞ్చకపాలముదవసానీయం నిర్వపేదగ్నిః సర్వా దేవతాః [౧౪] పాఙ్క్తో యజ్ఞో దేవతాశ్చైవ యజ్ఞం చాఽవ రున్ధే గాయత్రో వా అగ్నిర్గాయత్రఛన్దాస్తం ఛన్దసా వ్యర్ధయతి యత్పఞ్చకపాలం కరోత్యష్టాకపాలః కార్యోఽష్టాక్షరా గాయత్రీ గాయత్రోఽగ్నిర్గాయత్ర ఛన్దాః స్వేనైవైనం ఛన్దసా సమర్ధయతి పఙ్క్త్యౌ యాజ్యానువాక్యే భవతః పాఙ్క్తో యజ్ఞస్తేనైవ యజ్ఞాన్నైతి॥[౧౫]

*సవితర్దేవా యజ్ఞముషస్సర్వా దేవతాస్త్రిచత్వారిగ్ంశచ్చ*||**3.5.4**||

సూర్యో మా దేవో దేవేభ్యః పాతు వాయురన్తరిక్షాద్యజమానోఽగ్నిర్మా పాతు చక్షుషః। సక్ష శూష సవితర్విశ్వచర్షణ ఏతేభిః సోమ నామభిర్విధేమ తే తేభిః సోమ నామభిర్విధేమ తే। అహం పరస్తాదహమవస్తాదహం జ్యోతిషా వి తమో వవార। యదన్తరిక్షం తదు మే పితాఽభూదహగ్ం సూర్యముభయతో దదర్శాఽహం భూయాసముత్తమః సమానానా- [౧౬] మా సముద్రాదాఽన్తరిక్షాత్ప్రజాపతిరుదధిం చ్యావయాతీన్ద్రః ప్ర స్నౌతు మరుతో వర్షయన్తూన్నం భయ పృథివీం భిన్ధీదం దివ్యం నభః। ఉద్నో దివ్యస్య నో దేహీశానో వి సృజా దృతిమ్॥ పశవో వా ఏతే యదాదిత్య ఏష రుద్రో యదగ్నిరోషధీః ప్రాస్యాఽగ్నావాదిత్యం జుహోతి రుద్రాదేవ పశూనన్తర్దధాత్యథో ఓషధీష్వేవ పశూన్ [౧౭] ప్రతి ష్ఠాపయతి కవిర్యజ్ఞస్య వి తనోతి పన్థాం నాకస్య పృష్ఠే అధి రోచనే దివః। యేన హవ్యం వహసి యాసి దూత ఇతః ప్రచేతా అముతః సనీయాన్॥ యాస్తే విశ్వాః సమిధః సన్త్యగ్నే

యాః పృథివ్యాం బర్హిషి సూర్యే యాః। తాస్తే గచ్ఛన్త్వాహుతిం ఘృతస్య దేవాయతే యజమానాయ శర్మ॥ ఆశాసానః సువీర్యగ్ం రాయ స్పోషగ్ం స్వశ్వియమ్। బృహస్పతినా రాయాస్వగాకృతో మహ్యం యజమానాయ తిష్ఠ॥[౧౮]

*సమానానామోషధీష్వేవ పశూన్మహ్యం యజమానాయైకంచ*||**3.5.5**||

సం త్వా నహ్యామి పయసా ఘృతేన సం త్వా నహ్యామ్యప ఓషధీభిః। సం త్వా నహ్యామి ప్రజయాఽహమద్య సా దీక్షితా సనవో వాజమస్మే॥ ప్రైతు బ్రహ్మణస్పత్నీ వేదిం వర్ణేన సీదతు। అథాఽహమనుకామినీ స్వే లోకే విశా ఇహ। సుప్రజసస్త్వా వయగ్ం సుపత్నీరుప సేదిమ। అగ్నే సపత్నదమ్భనమదబ్ధాసో అదాభ్యమ్॥ ఇమం విష్యామి వరుణస్య పాశం [౧౯] యమబధ్నీత సవితా సుకేతః। ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం మే సహ పత్యా కరోమి॥ ప్రేహ్యుదేహ్యృతస్య వామీరన్వగ్నిస్తేఽగ్రం నయత్వదితిర్మధ్యం దదతాగ్ం రుద్రావసృష్టాసి యువా నామ మా మా హిగ్ంసీర్వసుభ్యో రుద్రేభ్య ఆదిత్యేభ్యో విశ్వేభ్యో వో దేవేభ్యః పన్నేజనీర్గృహ్ణామి యజ్ఞాయ వః పన్నేజనీః సాదయామి విశ్వస్య తే విశ్వావతో వృష్ణియావత- [౨౦] స్తవాఽగ్నే వామీరను సందృశి విశ్వా రేతాగ్ంసి ధిషీయాఽగన్దేవాన్ యజ్ఞో ని దేవీర్దేవేభ్యో యజ్ఞమశిషన్నస్మిన్థ్సున్వతి యజమాన ఆశిషః స్వాహాకృతాః సముద్రేష్ఠా గన్ధర్వమా తిష్ఠతాను। వాతస్య పత్మన్నిడ ఈడితాః॥[౨౧]

*పాశం వృష్ణియావతస్త్రిగ్ం శచ్ఛ*||**3.5.6**||

వషట్కారో వై గాయత్రియై శిరోఽచ్ఛినత్తస్యై రసః పరాఽపతథ్స పృథివీం ప్రాఽవిశథ్స ఖదిరోఽభవద్యస్య ఖాదిరః స్రువో భవతి ఛన్దసామేవ రసేనాఽవ ద్యతి సరసా అస్యాఽఽహుతయో భవన్తి తృతీయస్యామితో దివి సోమ ఆసీత్తం గాయత్ర్యాఽహరత్తస్య పర్ణమచ్ఛిద్యత తత్పర్ణోఽభవత్తత్పర్ణస్య పర్ణత్వం యస్య పర్ణమయీ జుహూ- [౨౨] ర్భవతి

సౌమ్యా అస్యాऽऽహుతయో భవన్తి జుషన్తేऽస్య దేవా ఆహుతీర్దేవా వై బ్రహ్మన్నవదన్త
తత్పర్ణ ఉపాऽశృణోథ్సుశ్రవా వై నామ యస్య పర్ణమయీ జుహూర్భవతి న పాపగ్గ్
శ్లోకగ్ం శృణోతి బ్రహ్మ వై పర్ణో విణ్మరుతోऽన్నం విణ్మారుతోऽశ్వత్థో యస్య పర్ణమయీ
జుహూర్భవత్యాశ్వత్థ్యుపభృద్బ్రహ్మణైవాన్నమవ రున్ధేऽథో బ్రహ్మై- [౨౩] వ విశ్యధ్యూహతి
రాష్ట్రం వై పర్ణో విడశ్వత్థో యత్పర్ణమయీ జుహూర్భవత్యాశ్వత్థ్యుపభృద్రాష్ట్రమేవ
విశ్యధ్యూహతి ప్రజాపతిర్వా అజుహోథ్స యత్రాऽऽహుతిః ప్రత్యతిష్ఠత్తతో వికఙ్కత
ఉదతిష్ఠత్తతః ప్రజా అసృజత యస్య వైకఙ్కతీ ధ్రువా భవతి
ప్రత్యేవాऽస్యాऽऽహుతయస్తిష్ఠన్త్యథో ప్రైవ జాయత ఏతద్వై స్రుచాగ్ం రూపం
యస్యైవగ్ం రూపాః స్రుచో భవన్తి సర్వాణ్యేవైనగ్ం రూపాణి పశూనాముప తిష్ఠన్తే
నాऽస్యాऽపరూపమాత్మఞ్జాయతే॥[౨౪]

*జుహూరథో బ్రహ్మ స్రుచాగ్ం సప్తదశ చ*॥**3.5.7**॥

ఉపయామగృహీతోऽసి ప్రజాపతయే త్వా జ్యోతిష్మతే జ్యోతిష్మన్తం గృహ్ణామి దక్షాయ
దక్షవృధే రాతం దేవేభ్యోऽగ్నిజిహ్వేభ్యస్త్వర్తాయుభ్య ఇన్ద్రజ్యేష్ఠేభ్యో వరుణరాజభ్యో
వాతాపిభ్యః పర్జన్యాత్మభ్యో దివే త్వాऽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వాऽపేన్ద్ర ద్విషతో మనోऽప
జిజ్యాసతో జహ్యప యో నోऽరాతీయతి తం జహి ప్రాణాయ త్వాऽపానాయ త్వా వ్యానాయ
త్వా సతే త్వాసతే త్వాऽద్భ్యస్త్వౌషధీభ్యో విశ్వేభ్యస్త్వా భూతేభ్యో యతః ప్రజా అక్ఖిద్రా
అజాయన్త తస్మై త్వా ప్రజాపతయే విభూదావ్న్నే జ్యోతిష్మతే జ్యోతిష్మన్తం జుహోమి॥[౨౫]

*ఓషధీభ్యశ్చతుర్దశ చ*॥**3.5.8**॥

యాం వా అధ్వర్యుశ్చ యజమానశ్చ దేవతామన్తరితస్తస్యా ఆ వృశ్చ్యేతే ప్రాజాపత్యం
దధిగ్రహం గృహ్ణీయాత్ప్రజాపతిః సర్వా దేవతా దేవతాభ్య ఏవ ని హ్నువాతే జ్యేష్ఠో వా ఏష

గ్రహాణాం యస్యైష గృహ్యతే జ్యైష్ఠ్యమేవ గచ్ఛతి సర్వాసాం వా ఏతద్దేవతానాగ్ం రూపం యదేష గ్రహో యస్యైష గృహ్యతే సర్వాణ్యేవైనగ్ం రూపాణి పశూనాముప తిష్ఠన్త ఉపయామగృహీతో- [౨౬] ఽసి ప్రజాపతయే త్వా జ్యోతిష్మతే జ్యోతిష్మన్తం గృహ్ణామీత్యాహ జ్యోతిరేవైనగ్ం సమానానాం కరోత్యగ్నిజిహ్వేభ్యస్త్వర్తాయుభ్య ఇత్యాహైతావతీర్వై దేవతాస్తాభ్య ఏవైనగ్ం సర్వాభ్యో గృహ్ణాత్యపేన్ద్ర ద్విషతో మన ఇత్యాహ భ్రాతృవ్యాపనుత్త్యై ప్రాణాయ త్వాఽపానాయ త్వేత్యాహ ప్రాణానేవ యజమానే దధాతి తస్మై త్వా ప్రజాపతయే విభూదావ్న్నే జ్యోతిష్మతే జ్యోతిష్మన్తం జుహోమీ- [౨౭] త్యాహ ప్రజాపతిః సర్వా దేవతాః సర్వాభ్య ఏవైనం దేవతాభ్యో జుహోత్యాజ్యగ్రహం గృహ్ణీయాత్తేజస్కామస్య తేజో వా ఆజ్యం తేజస్వ్యేవ భవతి సోమగ్రహం గృహ్ణీయాద్బ్రహ్మవర్చసకామస్య బ్రహ్మవర్చసం వై సోమో బ్రహ్మవర్చస్యేవ భవతి దధిగ్రహం గృహ్ణీయాత్పశుకామస్యోర్గ్వై దధ్యూర్క్పశవ ఊర్జైవాస్మా ఊర్జం పశూనవ రున్ధే॥[౨౮]

*ఉపయామగృహీతో జుహోమి త్రిచత్వారిగ్ంశచ్చ*||**3.5.9**||

త్వే క్రతుమపి వృఞ్జన్తి విశ్వే ద్విర్యదేతే త్రిర్భవన్త్యూమాః। స్వాదోః స్వాదీయః స్వాదునా సృజా సమత ఊ షు మధు మధునాఽభి యోధి॥ ఉపయామగృహీతోఽసి ప్రజాపతయే త్వా జుష్టం గృహ్ణామ్యేష తే యోనిః ప్రజాపతయే త్వా। ప్రాణగ్రహాన్ గృహ్ణాత్యేతావద్వా అస్తి యావదేతే గ్రహాః స్తోమాశ్ఛన్దాగ్ంసి పృష్ఠాని దిశో యావదేవాఽస్తి త- [౨౯] దవ రున్ధే జ్యేష్ఠా వా ఏతాన్ బ్రాహ్మణాః పురా విద్వామక్రన్తస్మాత్తేషాగ్ం సర్వా దిశోఽభిజితా అభూవన్ యస్యైతే గృహ్యన్తే జ్యైష్ఠ్యమేవ గచ్ఛత్యభి దిశో జయతి పఞ్చ గృహ్యన్తే పఞ్చ దిశః సర్వాస్వేవ దిక్ష్వృధ్నువన్తి నవనవ గృహ్యన్తే నవ వై పురుషే ప్రాణాః ప్రాణానేవ యజమానేషు దధతి ప్రాయణీయే చోదయనీయే చ గృహ్యన్తే ప్రాణా వై ప్రాణగ్రహాః [30] ప్రాణైరేవ ప్ర యన్తి ప్రాణైరుద్యన్తి దశమేఽహన్ గృహ్యన్తే ప్రాణా వై ప్రాణగ్రహాః ప్రాణేభ్యః

ఖలు వా ఏతత్ప్రజా యన్తి యద్వామదేవ్యం యోనేశ్చ్యవతే దశమే ఽహన్వామదేవ్యం యోనేశ్చ్యవతే యద్దశమేఽహన్ గృహ్యన్తే ప్రాణేభ్య ఏవ తత్ప్రజా న యన్తి॥[30]

*తత్ప్రాణ గ్రహాస్సప్తత్రిగ్ంశచ్చ*||**3.5.10**||

ప్ర దేవం దేవ్యా ధియా భరతా జాతవేదసమ్। హవ్యా నో వక్షదానుషక్॥ అయము ష్య ప్ర దేవయుర్హోతా యజ్ఞాయ నీయతే। రథో న యోరభీవృతో ఘృణీవాఞ్చేతతి త్మనా॥ అయమగ్నిరురుష్యత్యమృతాదివ జన్మనః। సహసశ్చిథ్సహీయాన్దేవో జీవాతవే కృతః॥ ఇడాయాస్త్వా పదే వయం నాభా పృథివ్యా అధి। జాతవేదో ని ధీమహ్యగ్నే హవ్యాయ వోఢవే [32] అగ్నే విశ్వేభిః స్వనీక దేవైరూర్ణావన్తం ప్రథమః సీద యోనిమ్। కులాయినం ఘృతవన్తగ్ం సవిత్రే యజ్ఞం నయ యజమానాయ సాధు॥ సీద హోతః స్వ ఉ లోకే చికిత్వాన్థ్సాదయా యజ్ఞగ్ం సుకృతస్య యోనౌ। దేవావీర్దేవాన్ హవిషా యజాస్యగ్నే బృహద్యజమానే వయో ధాః॥ ని హోతా హోతృషదనే విదానస్త్వేషో దీదివాగ్ం అసదథ్సుదక్షః। అదబ్ధవ్రతప్రమతిర్వసిష్ఠః సహస్రం భరః శుచిజిహ్వో అగ్నిః॥ త్వం దూతస్త్వ- [33] ము నః పరస్పాస్త్వం వస్య ఆ వృషభ ప్రణేతా। అగ్నే తోకస్య నస్తనే తనూనామప్రయుచ్ఛన్దీద్యద్బోధి గోపాః॥ అభి త్వా దేవ సవితరీశానం వార్యాణామ్। సదాఽవన్భాగమీమహే॥ మహీ ద్యౌః పృథివీ చ న ఇమం యజ్ఞం మిమిక్షతామ్। పిపృతాం నో భరీమభిః॥ త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత। మూర్ధ్నో విశ్వస్య వాఘతః॥ తము [34] త్వా దధ్యఙ్ఙృషిః పుత్ర ఈధే అథర్వణః। వృత్రహణం పురన్దరమ్॥ తము త్వా పాథ్యో వృషా సమీధే దస్యుహన్తమమ్। ధనఞ్జయగ్ం రణేరణే॥ ఉత బ్రువన్తు జన్తవ ఉదగ్నిర్వృత్రహాఽజని। ధనఞ్జయో రణేరణే॥ ఆ యగ్ం హస్తే న ఖాదినగ్ం శిశుం జాతం న బిభ్రతి। విశామగ్నిగ్గ్ స్వధ్వరమ్॥ ప్ర దేవం దేవవీతయే భరతా వసువిత్తమమ్। ఆ స్వే యోనౌ ని షీదతు॥ ఆ [35] జాతం జాతవేదసి ప్రియగ్ం శిశీతాఽతిథిమ్। స్యోన ఆ

గృహపతిమ్॥ అగ్నినాऽగ్నిః సమిధ్యతే కవిర్గృహపతిర్యువా। హవ్యవాడ్జుహ్వాస్యః॥ త్వగ్గ్ హ్యగ్నే అగ్నినా విప్రో విప్రేణ సన్థ్సతా। సఖా సఖ్యా సమిధ్యసే॥ తం మర్జయన్త సుక్రతుం పురోయావానమాజిషు। స్వేషు క్షయేషు వాజినమ్॥ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్। తే హ నాకం మహిమానః సచన్తే యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః॥[౩౬]

*వోఢవే దూతస్త్వం తముసీదత్వా యత్ర చత్వారి చ॥**3.5.11**॥*

*పూర్ణా ఋషయోऽగ్నినా యే దేవాస్సూర్యో మా సం త్వా నహ్యామి వషట్కారస్స ఖదిర ఉపయామగృహీతోऽసి యాం వై త్వే క్రతుం ప్ర దేవమేకాదశ॥**11**॥*

*పూర్ణా సహజాన్తవాऽగ్నే ప్రాణైరేవ షట్త్రిగ్ంశత్॥౩౬॥*

*పూర్ణా సన్తి దేవాః॥*

॥హరిః ఓమ్॥

॥శ్రీ కృష్ణార్పణమస్తు॥

॥ఇతి తృతీయకాణ్డే పఞ్చమః ప్రశ్నః॥

॥తృతీయకాణ్డః సమాప్తః॥

# కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితా

## ॥అథ చతుర్థ కాణ్డే ప్రథమః ప్రశ్నః॥

హరిః ఓమ్॥ యుఞ్జానః ప్రథమం మనస్తత్వాయ సవితా ధియః। అగ్నిం జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాఽభరత్॥ యుక్త్వాయ మనసా దేవాన్థ్సువర్యతో ధియా దివమ్। బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్ర సువాతి తాన్॥ యుక్తేన మనసా వయం దేవస్య సవితుః సవే। సువర్గేయాయ శక్త్యై॥ యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః। వి హోత్రా దధే వయునావిదేక ఇ- [౧] న్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః॥ యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిర్వి శ్లోకా యన్తి పథ్యేవ సూరాః। శృణ్వన్తి విశ్వే అమృతస్య పుత్రా ఆ యే ధామాని దివ్యాని తస్థుః॥ యస్య ప్రయాణమన్వన్య ఇద్యయుర్దేవా దేవస్య మహిమానమర్చతః। యః పార్థివాని వి మమే స ఏతశో రజాగ్ంసి దేవః సవితా మహిత్వనా॥ దేవ సవితః ప్ర సువ యజ్ఞం ప్ర సువ [౨] యజ్ఞపతిం భగాయ దివ్యో గన్ధర్వః। కేతపూః కేతం నః పునాతు వాచస్పతిర్వాచమద్య స్వదాతి నః॥ ఇమం నో దేవ సవితర్యజ్ఞం ప్ర సువ దేవాయువగ్ం సఖివిదగ్ం సత్రాజితన్ధనజితగ్ం సువర్జితమ్॥ ఋచా స్తోమగ్ం సమర్ధయ గాయత్రేణ రథంతరమ్। బృహద్గాయత్రవర్తని॥ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం గాయత్రేణ ఛన్దసాఽఽదదేఽఙ్గిరస్వదభ్రిరసి నారి- [3] రసి పృథివ్యాః సధస్థాదగ్నిం పురీష్యమఙ్గిరస్వదా భర త్రైష్టుభేన త్వా ఛన్దసాఽఽదదేఽఙ్గిరస్వద్బభ్రిరసి నారిరసి త్వయా వయగ్ం సధస్థ ఆఽగ్నిగ్ం శకేమ ఖనితుం పురీష్యం జాగతేన త్వా ఛన్దసాఽఽదదే ఽఙ్గిరస్వద్ధస్త ఆధాయ సవితా బిభ్రదభ్రిగ్ం హిరణ్యయీమ్। తయా జ్యోతిరజస్రమిదగ్నిం ఖాత్వీ న ఆ భరాఽఽనుష్టుభేన త్వా ఛన్దసాఽఽదదేఽఙ్గిరస్వత్॥[౪]

*ఇద్యజ్ఞం ప్ర సువ నారిరనుష్టుభేన త్వా ఛన్దసా త్రీణి చ॥**4.1.1**॥*

ఇమామగృభ్ణన్రశనామృతస్య పూర్వ ఆయుషి విదథేషు కవ్యా। తయా దేవాః సుతమా బభూవుర్‌ఋతస్య సామన్థ్సరమారపన్తీ॥ ప్రతూర్తం వాజిన్నా ద్రవ వరిష్ఠామను సంవతమ్। దివి తే జన్మ పరమమన్తరిక్షే నాభిః పృథివ్యామధి యోనిః॥ యుఞ్జాథాగ్ం రాసభం యువమస్మిన్ యామే వృషణ్వసూ। అగ్నిం భరన్తమస్మయుమ్॥ యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే। సఖాయ ఇన్ద్రమూతయే॥ ప్రతూర్వ- [౫] న్నేహ్యవక్రామన్నశస్తీ రుద్రస్య గాణపత్యాన్మయోభూరేహి। ఉర్వన్తరిక్షమన్విహి స్వస్తిగవ్యూతిరభయాని కృణ్వన్న్॥ పూష్ణా సయుజా సహ। పృథివ్యాః సధస్థాదగ్నిం పురీష్యమఙ్గిరస్వదచ్ఛేహ్యగ్నిం పురీష్యమఙ్గిరస్వదచ్ఛేమోఽగ్నిం పురీష్యమఙ్గిరస్వద్భరిష్యామోఽగ్నిం పురీష్యమఙ్గిరస్వద్భరామః॥ అన్వగ్నిరుషసామగ్రమఖ్యదన్వహాని ప్రథమో జాతవేదాః। అను సూర్యస్య [౬] పురుత్రా చ రశ్మీనను ద్యావాపృథివీ ఆ తతాన॥ ఆగత్య వాజ్యధ్వనః సర్వా మృధో వి ధూనుతే। అగ్నిగ్ం సధస్థే మహతి చక్షుషా ని చికీషతే॥ ఆక్రమ్య వాజిన్ పృథివీమగ్నిమిచ్ఛ రుచా త్వమ్। భూమ్యా వృత్వాయ నో బ్రూహి యతః ఖనామ తం వయమ్॥ ద్యౌస్తే పృష్ఠం పృథివీ సధస్థమాత్మాఽన్తరిక్షగ్ం సముద్రస్తే యోనిః। విఖ్యాయ చక్షుషా త్వమభి తిష్ఠ [౭] పృతన్యతః॥ ఉత్క్రామ మహతే సౌభగాయాఽస్మాదాస్థానాద్ద్రవిణోదా వాజిన్న్। వయగ్గ్ స్యామ సుమతౌ పృథివ్యా అగ్నిం ఖనిష్యన్త ఉపస్థే అస్యాః॥ ఉదక్రమీద్ద్రవిణోదా వాజ్యర్వాఽకః స లోకగ్ం సుకృతం పృథివ్యాః। తతః ఖనేమ సుప్రతీకమగ్నిగ్ం సువో రుహాణా అధి నాక ఉత్తమే॥ అపో దేవీరుప సృజ మధుమతీరయక్ష్మాయ ప్రజాభ్యః। తాసాగ్ స్థానాదుజ్జిహతామోషధయః సుపిప్పలాః॥ జిఘర్మ్య- [౮] గ్నిం మనసా ఘృతేన ప్రతిక్ష్యన్తం భువనాని విశ్వా। పృథుం తిరశ్చా వయసా బృహన్తం వ్యచిష్ఠమన్నగ్ం రభసం

విదానమ్॥ ఆ త్వా జిఘర్మి వచసా ఘృతేనాఽరక్షసా మనసా తజ్జుషస్వ। మర్యశ్రీః స్పృహయద్వర్ణో అగ్నిర్నాఽభిమృశే తనువా జర్హృషాణః॥ పరి వాజపతిః కవిరగ్నిర్హవ్యాన్యక్రమీత్। దధద్రత్నాని దాశుషే॥ పరి త్వాఽగ్నే పురం వయం విప్రగ్ం సహస్య ధీమహి। ధృషద్వర్ణం దివేదివే భేత్తారం భఙ్గురావతః॥ త్వమగ్నే ద్యుభిస్త్వమాశుశుక్షణిస్త్వమద్భ్యస్త్వమశ్మనస్పరి। త్వం వనేభ్యస్త్వమోషధీభ్యస్త్వం నృణాం నృపతే జాయసే శుచిః॥[౯]

*ప్రతూర్వన్నూర్ధ్వస్య తిష్ఠ జిఘర్మి భేత్తారం విగ్ంశతిశ్చ॥* ***4.1.2***॥

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం పృథివ్యాః సధస్థేఽగ్నిం పురీష్యమఙ్గిరస్వత్ఖనామి॥ జ్యోతిష్మన్తం త్వాఽగ్నే సుప్రతీకమజస్రేణ భానునా దీద్యానమ్। శివం ప్రజాభ్యోఽహిగ్ంసన్తం పృథివ్యాః సధస్థేఽగ్నిం పురీష్యమఙ్గిరస్వత్ఖనామి॥ అపాం పృష్ఠమసి సప్రథా ఉర్వగ్నిం భరిష్యదపరావపిష్ఠమ్। వర్ధమానం మహ ఆ చ పుష్కరం దివో మాత్రయా వరిణా ప్రథస్వ॥ శర్మ చ స్థో [౧౦] వర్మ చ స్థో అచ్ఛిద్రే బహులే ఉభే। వ్యచస్వతీ సం వసాథాం భర్తమగ్నిం పురీష్యమ్॥ సం వసాథాగ్ం సువర్విదా సమీచీ ఉరసా త్మనా। అగ్నిమన్తర్భరిష్యన్తీ జ్యోతిష్మన్త మజస్రమిత్॥ పురీష్యోఽసి విశ్వభరాః। అథర్వా త్వా ప్రథమో నిరమన్థదగ్నే॥ త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత। మూర్ధ్నో విశ్వస్య వాఘతః॥ తము త్వా దధ్యఙ్ఙృషిః పుత్ర ఈధే [౧౧] అథర్వణః। వృత్రహణం పురన్దరమ్॥ తము త్వా పాథ్యో వృషా సమీధే దస్యుహన్తమమ్। ధనఞ్జయగ్ం రణేరణే॥ సీద హోతః స్వ ఉ లోకే చికిత్వాన్థ్సాదయా యజ్ఞగ్ం సుకృతస్య యోనౌ। దేవావీర్దేవాన్ హవిషా యజాస్యగ్నే బృహద్యజమానే వయో ధాః॥ ని హోతా హోతృషదనే విదానస్త్వేషో దీదివాగ్ం అసదథ్సుదక్షః। అదబ్ధవ్రతప్రమతిర్వసిష్ఠః సహస్రం భరః శుచిజిహ్వో అగ్నిః॥ సగ్ం సీదస్వ మహాగ్ం అసి శోచస్వ [౧౨] దేవవీతమః। వి ధూమమగ్నే అరుషం మియేధ్య

సృజ ప్రశస్త దర్శతమ్॥ జనిష్వా హి జేన్యో అగ్రే అహ్నాగ్ం హితో హితేష్వరుషో వనేషు। దమేదమే సప్తరత్నా దధానోఽగ్నిర్హోతా ని షసాదా యజీయాన్॥[౧౩]

*స్థ ఈఢే శోచస్వ సప్తవిగ్ంశతిశ్చ॥**4.1.3**॥*

సన్తే వాయుర్మాతరిశ్వా దధాతూత్తానాయై హృదయం యద్విలిష్టమ్। దేవానాం యశ్చరతి ప్రాణథేన తస్మై చ దేవి వషడస్తు తుభ్యమ్॥ సుజాతో జ్యోతిషా సహ శర్మ వరూథమాఽసదః సువః। వాసో అగ్నే విశ్వరూపగ్ం సం వ్యయస్వ విభావసో॥ ఉదు తిష్ఠ స్వధ్వరాఽవా నో దేవ్యా కృపా। దృశే చ భాసా బృహతా సుశుక్వనిరాఽగ్నే యాహి సుశస్తిభిః॥[౧౪] ఊర్ధ్వ ఊ షు ణ ఊతయే తిష్ఠా దేవో న సవితా। ఊర్ధ్వో వాజస్య సనితా యదఞ్జిభిర్వాఘద్భిర్విహ్వయామహే॥ స జాతో గర్భో అసి రోదస్యోరగ్నే చారుర్విభృత ఓషధీషు। చిత్రః శిశుః పరితమాగ్ంస్యక్తః ప్ర మాతృభ్యో అధి కనిక్రదద్గాః॥ స్థిరో భవ వీడ్వఙ్గ ఆశుర్భవ వాజ్యర్వన్। పృథుర్భవ సుషదస్త్వమగ్నేః పురీషవాహనః॥ శివో భవ [౧౫] ప్రజాభ్యో మానుషీభ్యస్త్వమఙ్గిరః। మా ద్యావాపృథివీ అభి శూశుచో మాఽన్తరిక్షం మా వనస్పతీన్॥ ప్రైతు వాజీ కనిక్రదన్నానదద్రాసభః పత్వా। భరన్నగ్నిం పురీష్యం మా పాద్యాయుషః పురా॥ రాసభో వాం కనిక్రదథ్సుయుక్తో వృషణా రథే। స వామగ్నిం పురీష్యమాశుర్దూతో వహాదితః॥ వృషాఽగ్నిం వృషణం భరన్నపాం గర్భగ్ం సముద్రియమ్। అగ్న ఆ యాహి [౧౬] వీతయ ఋతగ్ం సత్యమ్॥ ఓషధయః ప్రతి గృహ్ణీతాఽగ్నిమేతగ్ం శివమాయన్తమభ్యత్ర యుష్మాన్। వ్యస్యన్విశ్వా అమతీరరాతీర్నిషీదన్నో అప దుర్మతిగ్ం హనత్॥ ఓషధయః ప్రతి మోదధ్వమేనం పుష్పావతీః సుపిప్పలాః। అయం వో గర్భఋత్వియః ప్రత్నగ్ం సధస్థమాఽసదత్॥[౧౭]

*సుశస్తిభిః శివో భవ యాహి షట్త్రిగ్ంశచ్చ॥**4.1.4**॥*

వి పాజసా పృథునా శోశుచానో బాధస్వ ద్విషో రక్షసో అమీవాః। సుశర్మణో బృహతః శర్మణి స్యామగ్నేరహగ్ం సుహవస్య ప్రణీతౌ॥ ఆపో హి ష్ఠా మయోభువ స్తాన ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే॥ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః॥ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః॥ మిత్రః [౧౦] సగ్ంసృజ్య పృథివీం భూమిం చ జ్యోతిషా సహ। సుజాతం జాతవేదసమయక్ష్మాయ త్వా సగ్ంసృజామి ప్రజాభ్యః। విశ్వే త్వా దేవా వైశ్వానరాః సగ్ంసృజన్త్వానుష్టుభేన ఛన్దసాఽఙ్గిరస్వత్॥ రుద్రాః సమ్భృత్య పృథివీం బృహజ్జ్యోతిః సమీధిరే। తేషాం భానురజస్ర ఇచ్ఛుక్రో దేవేషు రోచతే॥ సగ్ంసృష్టాం వసుభీ రుద్రైర్ధీరైః కర్మణ్యాం మృదమ్। హస్తాభ్యాం మృద్వీం కృత్వా సినీవాలీ కరోతు [౧౧] తామ్॥ సినీవాలీ సుకపర్దా సుకురీరా స్వౌపశా। సా తుభ్యమదితే మహ ఓఖాం దధాతు హస్తయోః॥ ఉఖాం కరోతు శక్త్యా బాహుభ్యామదితిర్ధియా। మాతా పుత్రం యథోపస్థేసాఽగ్నిం బిభర్తు గర్భ ఆ॥ మఖస్య శిరోఽసి యజ్ఞస్య పదే స్థః। వసవస్త్వా కృణ్వన్తు గాయత్రేణ ఛన్దసాఽఙ్గిరస్వత్పృథివ్యసి రుద్రాస్త్వాకృణ్వన్తు త్రైష్టుభేన ఛన్దసాఽఙ్గిరస్వదన్తరిక్షమస్యా [౧౨] దిత్యాస్త్వా కృణ్వన్తు జాగతేన ఛన్దసాఽఙ్గిరస్వద్ద్యౌరసి విశ్వే త్వా దేవా వైశ్వానరాః కృణ్వన్త్వానుష్టుభేన ఛన్దసాఽఙ్గిరస్వద్దిశోఽసి ధ్రువాఽసి ధారయా మయి ప్రజాగ్ం రాయస్పోషం గౌపత్యగ్ం సువీర్యగ్ం సజాతాన్ యజమానాయాఽదిత్యై రాస్నాఽస్యదితిస్తే బిలం గృహ్ణాతు పాఙ్క్తేన ఛన్దసాఽఙ్గిరస్వత్। కృత్వాయ సా మహీముఖాం మృన్మయీం యోనిమగ్నయే। తాం పుత్రేభ్యః సం ప్రాఽయచ్ఛదదితిః శ్రపయానితి॥[౧౩]

*మిత్రః కరోత్వన్తరిక్షమసి ప్ర చత్వారి చ॥**4.1.5**॥*

వసవస్త్వా ధూపయన్తు గాయత్రేణ ఛన్దసాఽఙ్గిరస్వద్రుద్రాస్త్వా ధూపయన్తు త్రైష్టుభేన

ఛన్దసాఽఙ్గిరస్వదాదిత్యాస్త్వా ధూపయన్తు జాగతేన ఛన్దసాఽఙ్గిరస్వద్విశ్వే త్వా దేవా వైశ్వానరా ధూపయన్త్వానుష్టుభేన ఛన్దసాఽఙ్గిరస్వదిన్ద్రస్త్వా ధూపయత్వఙ్గిరస్వద్విష్ణుస్త్వా ధూపయత్వఽఙ్గిరస్వద్వరుణస్త్వాధూపయత్వఙ్గిరస్వదదితిస్త్వా దేవీ విశ్వదేవ్యావతీ పృథివ్యాః సధస్థేఽఙ్గిరస్వత్ఖనత్వవట దేవానాం త్వా పత్నీ- [౨౨] ర్దేవీర్విశ్వదేవ్యావతీః పృథివ్యాః సధస్థేఽఙ్గిరస్వద్దధతూఖే ధిషణాస్త్వా దేవీర్విశ్వదేవ్యావతీః పృథివ్యాః సధస్థేఽఙ్గిరస్వదభీన్ధతాముఖే గ్నాస్త్వా దేవీర్విశ్వదేవ్యావతీః పృథివ్యాః సధస్థేఽఙ్గిరస్వచ్ఛ్రపయన్తూఖే వరూత్రయో జనయస్త్వా దేవీర్విశ్వదేవ్యావతీః పృథివ్యాః సధస్థేఽఙ్గిరస్వత్పచన్తూఖే। మిత్రైతాముఖాం పచైషా మా భేది। ఏతాం తే పరి దదామ్యభిత్త్యై। అభీమాం [౨౩] మహినా దివం మిత్రో బభూవ సప్రథాః। ఉత శ్రవసా పృథివీమ్॥ మిత్రస్య చర్షణీధృతః శ్రవో దేవస్య సానసిమ్। ద్యుమ్నం చిత్రశ్రవస్తమమ్॥ దేవస్త్వా సవితోద్వపతు సుపాణిః స్వఙ్గురిః। సుబాహురుత శక్త్యా॥ అపద్యమానా పృథివ్యాశా దిశ ఆ పృణ। ఉత్తిష్ఠ బృహతీ భవోర్ధ్వా తిష్ఠధ్రువా త్వమ్॥ వసవస్త్వాఽఽచ్ఛృన్దన్తు గాయత్రేణ ఛన్దసాఽఙ్గిరస్వద్రుద్రాస్త్వాఽఽచ్ఛృన్దన్తు త్రైష్టుభేన ఛన్దసాఽఙ్గిరస్వదాదిత్యాస్త్వాఽఽ చ్ఛృన్దన్తు జాగతేన ఛన్దసాఽఙ్గిరస్వద్విశ్వేత్వా దేవా వైశ్వానరా ఆ చ్ఛృన్దన్త్వానుష్టుభేన ఛన్దసాఙ్గిరస్వత్॥[౨౪]

*పత్నీరిమాగ్ం రుద్రాస్త్వాఽఽ చ్ఛృన్దన్త్వేకాన్న విగ్ంశతిశ్చ॥***4.1.6***॥*

సమాస్త్వాఽగ్న ఋతవో వర్ధయన్తు సంవత్సరా ఋషయో యాని సత్యా। సం దివ్యేన దీదిహి రోచనేన విశ్వా ఆ భాహి ప్రదిశః పృథివ్యాః॥ సంచేధ్యస్వాఽగ్నే ప్ర చ బోధయైనముచ్చ తిష్ఠ మహతే సౌభగాయ। మా చ రిషదుపసత్తా తే అగ్నే బ్రహ్మాణస్తే యశసః సన్తు మాఽన్యే॥ త్వామగ్నే వృణతే బ్రాహ్మణా ఇమే శివో అగ్నే [౨౫] సం వరణే

భవా నః। సపత్నహా నో అభిమాతిజిచ్చ స్వే గయే జాగృహ్యప్రయుచ్ఛన్॥ ఇహైవాఽగ్నే అధి ధారయా రయిం మా త్వా ని క్రన్ పూర్వచితో నికారిణః। క్షత్రమగ్నే సుయమమస్తు తుభ్యముపసత్తా వర్ధతాం తే అనిష్టృతః॥ క్షత్రేణాఽగ్నే స్వాయుః సగ్ం రభస్వ మిత్రేణాఽగ్నే మిత్రధేయే యతస్వ। సజాతానాం మధ్యమస్థా ఏధి రాజ్ఞామగ్నే విహవ్యో దీదిహీహ॥ అతి [౧౮] నిహో అతి స్రిధోఽత్యచిత్తిమత్యరాతిమగ్నే। విశ్వా హ్యగ్నే దురితా సహస్వాథాఽస్మభ్యగ్ం సహవీరాగ్ం రయిం దాః॥ అనాధృష్యో జాతవేదా అనిష్టృతో విరాడగ్నే క్షత్రభృద్దీదిహీహ। విశ్వా ఆశాః ప్రముఞ్చన్మానుషీర్భియః శివాభిరద్య పరి పాహి నో వృధే॥ బృహస్పతే సవితర్బోధయైనగ్ం సగ్ంశితం చిత్సంతరాగ్ం సగ్ం శిశాధి। వర్ధయైనం మహతే సౌభగాయ [౧౯] విశ్వ ఏనమను మదన్తు దేవాః॥ అముత్రభూయాదధ యద్యమస్య బృహస్పతే అభిశస్తేరముఞ్చః। ప్రత్యౌహతామశ్వినా మృత్యుమస్మాద్దేవానామగ్నే భిషజా శచీభిః॥ ఉద్వయం తమసస్పరి పశ్యన్తో జ్యోతిరుత్తరమ్। దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥[౨౦]

*ఇమే శివో అగ్నేఽతి సౌభగాయ చతుస్త్రిగ్ంశచ్చ॥**4.1.7**॥*

ఊర్ధ్వా అస్య సమిధో భవన్త్యూర్ధ్వా శుక్రా శోచీగ్ం ష్యగ్నేః। ద్యుమత్తమా సుప్రతీకస్య సూనోః॥ తనూనపాదసురో విశ్వవేదా దేవో దేవేషు దేవః। పథ ఆనక్తి మధ్వా ఘృతేన॥ మధ్వా యజ్ఞం నక్షసే ప్రీణానో నరాశగ్ంసో అగ్నే। సుకృద్దేవః సవితా విశ్వవారః॥ అచ్ఛాఽయమేతి శవసా ఘృతేనేడానో వహ్నిర్నమసా। అగ్నిగ్ం స్రుచో అధ్వరేషు ప్రయత్సు॥ స యక్షదస్య మహిమానమగ్నేః స [౨౧] ఈ మన్ద్రాసు ప్రయసః। వసుశ్చేతిష్ఠో వసుధాతమశ్చ॥ ద్వారో దేవీరన్వస్య విశ్వే వ్రతా దదన్తే అగ్నేః। ఉరువ్యచసో ధామ్నా పత్యమానాః॥ తే అస్య యోషణే దివ్యే న యోనావుషాసానక్తా। ఇమం యజ్ఞమవతామధ్వరం నః॥ దైవ్యా హోతారావూర్ధ్వమధ్వరం నోఽగ్నేర్జిహ్వామభి గృణీతమ్।

కృణుతం నః స్విష్టిమ్॥ తిస్రో దేవీర్బర్హిరేదగ్ం సదన్త్విడా సరస్వతీ [30] భారతీ। మహీ గృణానా॥ తన్నస్తురీపమద్భుతం పురుక్షు త్వష్టా సువీరమ్। రాయస్పోషం వి ష్యతు నాభిమస్మే॥ వనస్పతేఽవ సృజా రరాణస్త్మనా దేవేషు। అగ్నిర్హవ్యగ్ం శమితా సూదయాతి॥ అగ్నే స్వాహా కృణుహి జాతవేద ఇన్ద్రాయ హవ్యమ్। విశ్వే దేవా హవిరిదం జుషన్తామ్॥ హిరణ్యగర్భః సమవర్తతాఽగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్। స దాధారపృథివీం ద్యా- [30] ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥ యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ। య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ॥ య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః। యస్య ఛాయాఽమృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ॥ యస్యేమే హిమవన్తో మహిత్వా యస్య సముద్రగ్ం రసయా సహా- [32] ఽఽహుః। యస్యేమాః ప్రదిశో యస్య బాహూ కస్మై దేవాయ హవిషా విధేమ॥ యం క్రన్దసీ అవసా తస్తభానే అభ్యైక్షేతాం మనసా రేజమానే। యత్రాఽధి సూర ఉదితౌ వ్యేతి కస్మై దేవాయ హవిషా విధేమ॥ యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢే యేన సువః స్తభితం యేన నాకః। యో అన్తరిక్షేరజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ॥ ఆపో హ యన్మహతీర్విశ్వ- [33] మాయన్దక్షం దధానా జనయన్తీరగ్నిమ్। తతో దేవానాం నిరవర్తతాఽసురేకః కస్మై దేవాయ హవిషా విధేమ॥ యశ్చిదాపో మహినా పర్యపశ్యద్దక్షం దధానా జనయన్తీరగ్నిమ్। యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్ కస్మై దేవాయ హవిషా విధేమ॥[34]

*అగ్నేస్స సరస్వతీ ద్యాగ్ం సహ విశ్వాఽఽప్తతుస్త్రిగ్ంశచ్చ॥**4.1.8**॥*

*ఊర్ధ్వా యః ప్రాణతో య ఆత్మదా యస్యేమే యం క్రన్దసీ యేన ద్యౌరాపో హ యత్తతో దేవానాం యశ్చిదాపో యో దేవేషు నవ॥*

ఆకూతిమగ్నిం ప్రయుజగ్గ్ స్వాహా మనో మేధామగ్నిం ప్రయుజగ్గ్ స్వాహా చిత్తం

విజ్ఞాతమగ్నిం ప్రయుజగ్గ్ స్వాహా వాచో విధృతిమగ్నిం ప్రయుజగ్గ్ స్వాహా ప్రజాపతయే మనవే స్వాహాऽగ్నయే వైశ్వానరాయ స్వాహా విశ్వే దేవస్య నేతుర్మర్తో వృణీత సఖ్యం విశ్వే రాయ ఇషుధ్యసి ద్యుమ్నం వృణీత పుష్యసే స్వాహా మాసుభిత్థా మాసురిషో దృగ్ంహస్వ వీడయస్వ సు। అమ్బ ధృష్ణు వీరయస్వా- [౩౫] ऽగ్నిశ్చేదం కరిష్యథః॥ దృగ్ంహస్వ దేవి పృథివి స్వస్తయ ఆసురీ మాయా స్వధయా కృతాऽసి। జుష్టం దేవానామిదమస్తు హవ్యమరిష్టా త్వముదిహి యజ్ఞే అస్మిన్న్॥ మిత్రైతాముఖాం తపైషా మా భేది। ఏతాం తే పరి దదామ్యభిత్త్యై। ద్రువన్నః సర్పిరాసుతిః ప్రత్నో హోతా వరేణ్యః। సహసస్పుత్రో అద్భుతః॥ పరస్యా అధి సంవతోऽవరాగ్ం అభ్యా [౩౬] తర। యత్రాऽహమస్మి తాగ్ం అవ॥ పరమస్యాః పరావతో రోహిదశ్వ ఇహాऽऽగహి। పురీష్యః పురుప్రియోऽగ్నే త్వం తరా మృధః॥ సీద త్వం మాతురస్యా ఉపస్థే విశ్వాన్యగ్నే వయునాని విద్వాన్। మైనామర్చిషా మా తపసాऽభి శూశుచోऽన్తరస్యాగ్ం శుక్రజ్యోతిర్వి భాహి॥ అన్తరగ్నే రుచా త్వముఖాయై సదనే స్వే। తస్యాస్త్వగ్ం హరసా తపఞ్జాతవేదః శివో భవ॥ శివో భూత్వా మహ్యమగ్నేऽథో సీద శివస్త్వమ్। శివాః కృత్వా దిశః సర్వాః స్వాం యోనిమిహాऽऽసదః॥[౩౭]

*వీరయస్వాऽऽతపన్విగ్ంశతిశ్చ॥***4.1.9***॥*

యదగ్నే యాని కాని చాऽऽ తే దారూణి దధ్మసి। తదస్తు తుభ్యమిద్ఘృతం తజ్జుషస్వ యవిష్ఠ్య॥ యదత్త్యుపజిహ్వికా యద్వమ్రో అతిసర్పతి। సర్వం తదస్తు తే ఘృతం తజ్జుషస్వ యవిష్ఠ్య॥ రాత్రిగ్ం రాత్రిమప్రయావం భరన్తోऽశ్వాయేవ తిష్ఠతే ఘాసమస్మై। రాయస్పోషేణ సమిషా మదన్తోऽగ్నే మా తే ప్రతివేశా రిషామ॥ నాభా [౩౮] పృథివ్యాః సమిధానమగ్నిగ్ం రాయస్పోషాయ బృహతే హవామహే। ఇరం మదం బృహదుక్థం యజత్రం జేతారమగ్నిం పృతనాసు సాసహిమ్॥ యాః సేనా అభీత్వరీరావ్యాధినీరుగణా ఉత। యే స్తేనా యే చ తస్కరాస్తాగ్ స్తే అగ్నేऽపి దధామ్యాస్యే॥ దగ్గ్ష్ట్రాభ్యాం

మలిమ్లూఞ్జంభ్యైస్తస్కరాగ్ం ఉత। హనూభ్యాగ్ స్తేనాన్ భగవస్తాగ్ స్త్వంఖాద
సుఖాదితాన్॥ యే జనేషు మలిమ్లవః స్తేనాసస్తస్కరా వనే। యే [౩౯] కక్షేష్వఘాయవస్తాగ్స్తే
దధామి జమ్భయోః॥ యో అస్మభ్యమరాతీయాద్యశ్చ నో ద్వేషతే జనః। నిన్దాద్యో
అస్మాన్దిప్సాచ్చ సర్వం తం మస్మసా కురు॥ సగ్ంశితం మే బ్రహ్మ సగ్ంశితం వీర్యం బలమ్।
సగ్ంశితం క్షత్రం జిష్ణు యస్యాఽహమస్మి పురోహితః॥ ఉదేషాం బాహూ అతిరముద్వర్చ
ఉదూ బలమ్। క్షిణోమి బ్రహ్మణాఽమిత్రానున్నయామి [౪౦] స్వాగ్ం అహమ్। దృశానో రుక్మ
ఉర్వ్యా వ్యద్యౌద్దుర్మర్షమాయుః శ్రియే రుచానః। అగ్నిరమృతో అభవద్వయోభిర్యదేనం
ద్యౌరజనయథ్సురేతాః॥ విశ్వా రూపాణి ప్రతి ముఞ్చతే కవిః ప్రాఽసావీద్భద్రం ద్విపదే
చతుష్పదే। వినాకమఖ్యథ్సవితా వరేణ్యోఽను ప్రయాణముషసో వి రాజతి॥ నక్తోషాసా
సమనసా విరూపే ధాపయేతే శిశుమేకగ్ం సమీచీ। ద్యావా క్షామా రుక్మో [౪౧] అన్తర్వి భాతి
దేవా అగ్నిం ధారయన్ద్రవిణోదాః॥ సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షు
స్తోమ ఆత్మా సామ తే తనూర్వామదేవ్యం బృహద్రథన్తరే పక్షౌ యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం
ఛన్దాగ్ స్యఙ్గాని ధిష్ణియాః శఫా యజూగ్ంషి నామ। సుపర్ణోఽసి గరుత్మాన్ దివం గచ్ఛ
సువః పత॥[౪౨]

*నాభా వనే యే నయామి క్షామా రుక్మోఽష్టాత్రిగ్ంశచ్చ॥***4.1.10***॥*

అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి। స ఇద్దేవేషు గచ్ఛతి॥ సోమ యాస్తే
మయోభువ ఊతయః సన్తి దాశుషే। తాభిర్నోఽవితా భవ॥ అగ్నిర్మూర్ధా భువః॥ త్వం నః
సోమ యా తే ధామాని॥ తథ్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః
ప్రచోదయాత్॥ అచిత్తీ యచ్చకృమా దైవ్యే జనే దీనైర్దక్షైః ప్రభూతీ పూరుషత్వతా। [౪౩]
దేవేషు చ సవితర్మానుషేషు చ త్వం నో అత్ర సువతాదనాగసః॥ చోదయిత్రీ సూనృతానాం
చేతన్తీ సుమతీనామ్। యజ్ఞం దధే సరస్వతీ॥ పావీరవీ కన్యా చిత్రాయుః సరస్వతీ వీరపత్నీ

ధియం ధాత్। గ్నాభిరచ్ఛిద్రగ్ం శరణగ్ం సజోషా దురాధర్షం గృణతే శర్మ యగ్ంసత్॥ పూషా గా అన్వేతు నః పూషా రక్షత్వర్వతః। పూషా వాజగ్ం సనోతు నః॥ శుక్రం తే అన్యద్యజతం తే అన్య- [౪౪] ద్విషురూపే అహనీ ద్యౌరివాఽసి। విశ్వా హి మాయా అవసి స్వధావో భద్రా తే పూషన్నిహ రాతిరస్తు॥ తేఽవర్ధన్త స్వతవసో మహిత్వనాఽఽనాకం తస్థురురు చక్రిరే సదః। విష్ణుర్యద్ధాఽఽవద్వృషణం మదచ్యుతం వయో న సీదన్నధి బర్హిషి ప్రియే। ప్ర చిత్రమర్కం గృణతే తురాయ మారుతాయ స్వతవసే భరధ్వమ్। యే సహాగ్ంసి సహసా సహన్తే [౪౪] రేజతే అగ్నే పృథివీ మఖేభ్యః॥ విశ్వే దేవా విశ్వే దేవాః॥ ద్యావా నః పృథివీ ఇమగ్ం సిధ్రమద్య దివిస్పృశమ్। యజ్ఞం దేవేషు యచ్ఛతామ్॥ ప్ర పూర్వజే పితరా నవ్యసీభిర్గీర్భిః కృణుధ్వగ్ం సదనే ఋతస్య। ఆ నోద్యావాపృథివీ దైవ్యేన జనేన యాతం మహి వాం వరూథమ్॥ అగ్నిగ్గ్ స్తోమేన బోధయ సమిధానో అమర్త్యమ్। హవ్యా దేవేషు నో దధత్॥ స హవ్యవాడమర్త్య ఉశిగ్దూతశ్చనోహితః। అగ్నిర్ధియా సమృణ్వతి॥ శం నో భవన్తు వాజేవాజే॥[౪౩]

*పూరుషత్వతా యజతం తే అన్యథ్సహన్తే చనోహితోఽష్టౌ చ॥**4.1.11**॥*

*యుఞ్జాన ఇమామగృభ్ణన్దేవస్య సం తే వి పాజసా వసవస్త్వా సమాస్త్వోర్ధ్వా అస్యాకూతిం యదగ్నే యాన్యగ్నే యం యజ్ఞమేకాదశ॥**11**॥*

*యుఞ్జానో వర్మ చ స్థ ఆదిత్యాస్త్వా భారతీ స్వాగం అహగం షట్చత్వారిగ్ంశత్॥**43**॥యుఞ్జానో వాజేవాజే॥*

॥హరిః ఓమ్॥

॥శ్రీ కృష్ణార్పణమస్తు॥

॥ఇతి చతుర్థ కాణ్డే ప్రథమః ప్రశ్నః॥

# కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితా

## ॥అథ చతుర్థ కాణ్డే ద్వితీయః ప్రశ్నః॥

హరిః ఓమ్॥ విష్ణోః క్రమోఽస్యభిమాతిహా గాయత్రం ఛన్ద ఆ రోహ పృథివీమను వి క్రమస్వ నిర్భక్తః స యం ద్విష్మో విష్ణోః క్రమోఽస్యభిశస్తిహా త్రైష్టుభం ఛన్ద ఆ రోహాఽన్తరిక్షమను వి క్రమస్వ నిర్భక్తః స యం ద్విష్మో విష్ణోః క్రమోఽస్యరాతీయతో హన్తా జాగతం ఛన్ద ఆ రోహ దివమను వి క్రమస్వ నిర్భక్తః స యం ద్విష్మో విష్ణోః [౧] క్రమోఽసి శత్రూయతో హన్తాఽఽనుష్టుభం ఛన్ద ఆ రోహ దిశోఽను వి క్రమస్వ నిర్భక్తః స యం ద్విష్మః। అక్రన్దదగ్ని స్తనయన్నివ ద్యౌః క్షామా రేరిహద్వీరుధః సమఞ్జన్। సద్యో జజ్ఞానో వి హీమిద్ధో అఖ్యదా రోదసీ భానునా భాత్యన్తః॥ అగ్నేఽభ్యావర్తిన్నభి న ఆ వర్తస్వాఽఽయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా ధనేన॥ అగ్నే [౨] అఙ్గిరః శతం తే సన్త్వావృతః సహస్రం త ఉపావృతః। తాసాం పోషస్య పోషేణ పునర్నో నష్టమా కృధి పునర్నో రయిమా కృధి॥ పునరూర్జా ని వర్తస్వ పునరగ్న ఇషాఽఽయుషా। పునర్నః పాహి విశ్వతః॥ సహ రయ్యా ని వర్తస్వాఽగ్నే పిన్వస్వ ధారయా। విశ్వప్స్నియా విశ్వతస్పరి॥ ఉదుత్తమం వరుణ పాశమస్మదవాఽధమం [౩] వి మధ్యమగ్గ్ శ్రథాయ। అథా వయమాదిత్య వ్రతే తవాఽనాగసో అదితయే స్యామ॥ ఆ త్వాఽహార్షమన్తరభూర్ధ్రువస్తిష్ఠాఽవిచాచలిః। విశస్త్వా సర్వా వాఞ్ఛన్త్వస్మిన్రాష్ట్రమధి శ్రయ॥ అగ్రే బృహన్నుషసామూర్ధ్వో అస్థాన్నిర్జగ్మివాన్తమసో జ్యోతిషాఽఽగాత్। అగ్నిర్భానునా రుశతా స్వఙ్గ ఆ జాతో విశ్వా సద్మాన్యప్రాః॥ సీద త్వం మాతురస్యా [౪] ఉపస్థే విశ్వాన్యగ్నే వయునాని విద్వాన్। మైనామర్చిషా మా తపసాఽభి శూశుచోఽన్తరస్యాగ్ం శుక్రజ్యోతిర్వి భాహి॥ అన్తరగ్నే రుచా త్వముఖాయై సదనే స్వే। తస్యాస్త్వగ్ం హరసా తపఞ్జాతవేదః శివో భవ॥ శివో భూత్వా మహ్యమగ్నేఽథో సీద

శివస్త్వమ్। శివాః కృత్వా దిశః సర్వాః స్వాం యోనిమిహాఽఽసదః॥ హగ్ంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్। నృషద్వరసదృతసద్వ్యో మసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥[౫]

*దివమను వి క్రమస్వ నిర్భక్తస్స యంద్విష్మో విష్ణోర్ధనోఽగ్నేఽధమమస్యాః శుచిషథ్షోడశ చ॥***4.2.1**॥

దివస్పరి ప్రథమం జజ్ఞే అగ్నిరస్మద్ద్వితీయం పరి జాతవేదాః। తృతీయమప్సు నృమణా అజస్రమిన్ధాన ఏనం జరతే స్వాధీః॥ విద్మా తే అగ్నే త్రేధా త్రయాణి విద్మా తే సద్మ విభృతం పురుత్రా। విద్మా తే నామ పరమం గుహా యద్విద్మా తముత్సం యత ఆజగన్థ॥ సముద్రే త్వా నృమణా అప్స్వన్తర్నృచక్షా ఈధే దివో అగ్న ఊధన్న్। తృతీయే త్వా [౬] రజసి తస్థివాగ్ంసమృతస్య యోనౌ మహిషా అహిన్వన్న్॥ అక్రన్దదగ్నిః స్తనయన్నివ ద్యౌః క్షామా రేరిహద్వీరుధః సమఞ్జన్న్। సద్యో జజ్ఞానో వి హీమిద్ధో అఖ్యదా రోదసీ భానునా భాత్యన్తః॥ ఉశిక్పావకో అరతిః సుమేధా మర్తేష్వగ్నిరమృతో ని ధాయి। ఇయర్తి ధూమమరుషం భరిభ్రదుచ్ఛుక్రేణ శోచిషా ద్యామినక్షత్॥ విశ్వస్య కేతుర్భువనస్య గర్భ ఆ [౭] రోదసీ అపృణాజ్జాయమానః। వీడుం చిదద్రిమభినత్పరాయఞ్జనా యదగ్నిమయజన్త పఞ్చ॥ శ్రీణాముదారో ధరుణో రయీణాం మనీషాణాం ప్రార్పణః సోమగోపాః। వసోః సూనుః సహసో అప్సు రాజా వి భాత్యగ్ర ఉషసామిధానః॥ యస్తే అద్య కృణవద్భద్రశోచేఽపూపం దేవ ఘృతవన్తమగ్నే। ప్ర తం నయ ప్రతరాం వస్యో అచ్ఛాఽభి ద్యుమ్నం దేవభక్తం యవిష్ఠ॥ ఆ [౮] తం భజ సౌశ్రవసేష్వగ్న ఉక్థ ఉక్థ ఆ భజ శస్యమానే। ప్రియః సూర్యే ప్రియో అగ్నా భవాత్యుజ్జాతేన భినదదుజ్జనిత్వైః॥ త్వామగ్నే యజమానా అను ద్యూన్ విశ్వా వసూని దధిరే వార్యాణి। త్వయా సహ ద్రవిణమిచ్ఛమానా వ్రజం గోమన్తముశిజో వి వవ్రుః॥ దృశానో రుక్మ ఉర్వ్యా వ్యద్యౌద్దుర్మర్షమాయుః శ్రియే రుచానః। అగ్నిరమృతో అభవద్వయోభిర్యదేనం ద్యౌరజనయథ్సురేతాః॥[౯]

*తృతీయే త్వా గర్భ ఆ యవిష్ఠాఽఽ యచ్చత్వారి చ॥***4.2.2**॥

అన్నపతేఽన్నస్య నో దేహ్యనమీవస్య శుష్మిణః। ప్ర ప్రదాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే॥ ఉదు త్వా విశ్వే దేవా అగ్నే భరన్తు చిత్తిభిః। స నో భవ శివతమః సుప్రతీకో విభావసుః॥ ప్రేదగ్నే జ్యోతిష్మాన్ యాహి శివేభిరర్చిభిస్త్వమ్। బృహద్భిర్భానుభిర్భాసన్మా హిగ్ంసీస్తనువా ప్రజాః॥ సమిధాఽగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్। ఆ- [౧౦] ఽస్మిన్ హవ్యా జుహోతన॥ ప్రప్రాఽయమగ్నిర్భరతస్య శృణ్వే వి యథ్సూర్యో న రోచతే బృహద్భాః। అభి యః పూరుం పృతనాసు తస్థౌ దీదాయ దైవ్యో అతిథిః శివో నః॥ ఆపో దేవీః ప్రతి గృహ్ణీత భస్మైతథ్స్యోనే కృణుధ్వగ్ం సురభావు లోకే। తస్మై నమన్తాం జనయః సుపత్నీర్మాతేవ పుత్రం బిభృతా స్వేనమ్॥ అప్స్వగ్నే సధిష్టవ [౧౧] సౌషధీరను రుధ్యసే। గర్భే సఞ్జాయసే పునః॥ గర్భో అస్యోషధీనాం గర్భో వనస్పతీనాం। గర్భో విశ్వస్య భూతస్యాఽగ్నే గర్భో అపామసి॥ ప్రసద్య భస్మనా యోనిమపశ్చ పృథివీమగ్నే। సగ్ంసృజ్య మాతృభిస్త్వం జ్యోతిష్మాన్ పునరాఽసదః॥ పునరాసద్య సదనమపశ్చ పృథివీమగ్నే। శేషే మాతుర్యథోపస్థేఽన్తరస్యాగ్ం శివతమః॥ పునరూర్జా [౧౨] ని వర్తస్వ పునరగ్న ఇషాఽఽయుషా। పునర్నః పాహి విశ్వతః॥ సహ రయ్యా ని వర్తస్వాఽగ్నే పిన్వస్వ ధారయా। విశ్వప్స్నియా విశ్వతస్పరి॥ పునస్త్వాఽఽదిత్యా రుద్రా వసవః సమిన్ధతాం పునర్బ్రహ్మాణో వసునీథ యజ్ఞైః। ఘృతేన త్వం తనువో వర్ధయస్వ సత్యాః సన్తు యజమానస్య కామాః॥ బోధా నో అస్య వచసో యవిష్ఠ మగ్ంహిష్ఠస్య ప్రభృతస్య స్వధావః। పీయతి త్వో అను త్వో గృణాతి వన్దారుస్తే తనువం వన్దే అగ్నే॥ స బోధి సూరిర్మఘవా వసుదావా వసుపతిః। యుయోధ్యస్మద్ద్వేషాగ్ంసి॥[౧౩]

*ఆ తవోర్జాఽను షోడశ చ॥***4.2.3**॥

అపేత వీత వి చ సర్పతాఽతో యేఽత్ర స్థ పురాణా యే చ నూతనాః। అదాదిదం యమోఽవసానం పృథివ్యా అక్రన్నిమం పితరో లోకమస్మై॥ అగ్నేర్భస్మాఽస్యగ్నేః పురీషమసి సంజ్ఞానమసి కామధరణం మయి తే కామధరణం భూయాత్॥ సం యా వః ప్రియాస్తనువః సం ప్రియా హృదయాని వః। ఆత్మా వో అస్తు [౧౪] సం ప్రియః సం ప్రియాస్తనువో మమ॥ అయగ్ం సో అగ్నిర్యస్మిన్థ్సోమమిన్ద్రః సుతం దధే జఠరే వావశానః। సహస్రియం వాజమత్యం న సప్తిగ్ం ససవాన్థ్సన్థ్స్తూయసే జాతవేదః॥ అగ్నే దివో అర్ణమచ్ఛా జిగాస్యచ్ఛా దేవాగ్ం ఊచిషే ధిష్ణియా యే। యాః పరస్తాద్రోచనే సూర్యస్య యాశ్చాఽవస్తాదుపతిష్ఠన్త ఆపః॥ అగ్నే యత్తే దివి వర్చః పృథివ్యాం యదోషధీ [౧౫] ష్వప్సు వా యజత్ర। యేనాఽన్తరిక్షముర్వాతతన్థ త్వేషః స భానురర్ణవో నృచక్షాః॥ పురీష్యాసో అగ్నయః ప్రావణేభిః సజోషసః। జుషన్తాగ్ం హవ్యమాహుతమనమీవా ఇషో మహీః॥ ఇడామగ్నే పురుదగ్ం సగ్ం సనిం గోః శశ్వత్తమగ్ం హవమానాయ సాధ। స్యాన్నః సూనుస్తనయో విజావాఽగ్నే సా తే సుమతిర్భూత్వస్మే॥ అయం తే యోనిర్ ఋత్వియో యతో జాతో అరోచథాః। తం జాన [౧౬] న్నగ్న ఆ రోహాఽథా నో వర్ధయా రయిమ్॥ చిదసి తయా దేవతయాఽఙ్గిరస్వద్ధ్రువా సీద పరిచిదసి తయా దేవతయాఽఙ్గిరస్వద్ధ్రువా సీద లోకం పృణ ఛ్ఛిద్రం పృణాఽథో సీద శివా త్వమ్। ఇన్ద్రాగ్నీ త్వా బృహస్పతిరస్మిన్ యోనావసీషదన్॥ తా అస్య సూదదోహసః సోమగ్గ్ శ్రీణన్తి పృశ్నయః। జన్మన్దేవానాం విశస్త్రిష్వా రోచనే దివః॥[౧౭]

*అస్త్వోషధీషు జానన్నష్టాచత్వారిగ్ంశచ్చ॥***4.2.4***॥*

సమితగ్ం సం కల్పేథాగ్ం సం ప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ। ఇషమూర్జమభి సంవసానౌ సం వాం మనాగ్ంసి సం వ్రతా సము చిత్తాన్యాఽకరమ్॥ అగ్నే పురీష్యాఽధిపా భవా త్వం నః। ఇషమూర్జం యజమానాయ ధేహి॥ పురీష్యస్త్వమగ్నే రయిమాన్

పుష్టిమాగ్ం అసి। శివాః కృత్వా దిశః సర్వాః స్వాం యోనిమిహాఽఽసదః॥ భవతం నః
సమనసౌ సమోకసా [౧౦] వరేపసౌ। మా యజ్ఞగ్ం హిగ్ంసిష్టం మా యజ్ఞపతిం జాతపేదసౌ
శివౌ భవతమద్య నః॥ మాతేవ పుత్రం పృథివీ పురీష్యమగ్నిగ్ం స్వే యోనావభారుఖా। తాం
విశ్వైర్దేపైర్ఋతుభిః సంవిదానః ప్రజాపతిర్విశ్వకర్మా వి ముఞ్చతు॥ యదస్య పారే రజసః
శుక్రం జ్యోతిరజాయత। తన్నః పర్షదతి ద్విషోఽగ్నే పైశ్వానర స్వాహా॥ నమః సు తే
నిర్ఋతే విశ్వరూపే [౧౯] ఽయస్మయం వి చృతా బన్ధమేతమ్। యమేన త్వం యమ్యా
సంవిదానోత్తమం నాకమధి రోహయేమమ్॥ యత్తే దేవీ నిర్ఋతిరాబబన్ధ దామ
గ్రీవాస్వవిచర్త్యమ్। ఇదం తే తద్వి ష్యామ్యాయుషో న మధ్యాదథా జీవః పితుమద్ధి
ప్రముక్తః॥ యస్యాస్తే అస్యాః క్రూర ఆసఞ్జుహోమ్యేషాం బన్ధానామవసర్జనాయ। భూమిరితి
త్వా జనా విదుర్నిర్ఋతి [౨౦] రితి త్వాఽహం పరి పేద విశ్వతః॥
అసున్వన్తమయజమానమిచ్ఛ స్తేనస్యేత్యాం తస్కరస్యాఽన్వేషి। అన్యమస్మదిచ్ఛ సా త ఇత్యా
నమో దేవి నిర్ఋతే తుభ్యమస్తు॥ దేవీమహం నిర్ఋతిం వన్దమానః పితేవ పుత్రం
దసయే వచోభిః। విశ్వస్య యా జాయమానస్య పేద శిరః శిరః ప్రతి సూరీ వి చష్టే॥
నిపేశనః సంగమనో వసూనాం విశ్వా రూపాఽభి చష్టే [౨౧] శచీభిః। దేవ ఇవ సవితా
సత్యధర్మేన్ద్రో న తస్థౌ సమరే పథీనామ్॥ సం వరత్రా దధాతన నిరాహావాన్ కృణోతన।
సిఞ్చామహా అవటముద్రిణం వయం విశ్వాఽహాఽదస్తమక్షితమ్॥ నిష్కృతాహావమవటగ్ం
సువరత్రగ్ం సుషేచనమ్। ఉద్రిణగ్ం సిఞ్చే అక్షితమ్॥ సీరా యుఞ్జన్తి కవయో యుగా వి
తన్వతే పృథక్। ధీరా దేపేషు సుమ్నయా। యునక్త సీరా వి యుగా తనోత కృతే యోనౌ
వపతేహ [౨౨] బీజమ్। గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో సేదీయ ఇథ్సృణ్యా పక్వమాఽయత్॥
లాఙ్గలం పవీరవగ్ం సుశేవగ్ం సుమతిథ్సరు। ఉదిత్కృషతి గామవిం ప్రఫర్వ్యం చ
పీవరీమ్। ప్రస్థావద్రథవాహనమ్॥ శునం నః ఫాలా వి తుదన్తు భూమిగ్ం శునం కీనాశా
అభి యన్తు వాహాన్। శునం పర్జన్యో మధునా పయోభిః శునాసీరా శునమస్మాసు ధత్తమ్॥

కామం కామదుఘే ధుక్ష్వ మిత్రాయ వరుణాయ చ। ఇన్ద్రాయాఽగ్నయే పూష్ణ ఓషధీభ్యః ప్రజాభ్యః॥ ఘృతేన సీతా మధునా సమక్తా విశ్వైర్దేవైరనుమతా మరుద్భిః। ఊర్జస్వతీ పయసా పిన్వమానాఽస్మాన్థ్సీతే పయసాఽభ్యావవృథ్స్వ॥[౨౩]

*సమోఽసా విశ్వరూపే విదుర్విర్బుతిరభి చష్ట ఇహ మిత్రాయ ద్వావిగ్ం శతిశ్చ॥***4.2.5**॥

యా జాతా ఓషధయో దేవేభ్యస్త్రియుగం పురా। మన్దామి బభ్రూణామహగ్ం శతం ధామాని సప్త చ॥ శతం వో అంబధామాని సహస్రముత వో రుహః। అథా శతక్రత్వో యూయమిమం మే అగదం కృత॥ పుష్పావతీః ప్రసూవతీః ఫలినీరఫలా ఉత। అశ్వా ఇవ సజిత్వరీర్వీరుధః పారయిష్ణవః॥ ఓషధీరితి మాతరస్తద్వో దేవీరుప బ్రువే। రపాగ్ంసి విఘ్నతీరిత రప- [౨౪] శ్చాతయమానాః॥ అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతిః కృతా। గోభాజ ఇత్కిలాఽసథ యత్సనవథ పూరుషమ్॥ యదహం వాజయన్నిమా ఓషధీర్హస్త ఆదధే। ఆత్మా యక్ష్మస్య నశ్యతి పురా జీవగృభో యథా॥ యదోషధయః సంగచ్ఛన్తే రాజానః సమితావివ। విప్రః స ఉచ్యతే భిషగ్రక్షోహామీవచాతనః॥ నిష్కృతిర్నామ వో మాతాఽథా యూయగ్గ్ స్థ సంకృతీః। సరాః పతత్రిణీః [౨౫] స్థన యదామయతి నిష్కృత॥ అన్యా వో అన్యామవత్వన్యాఽన్యస్యా ఉపాఽవత। తాః సర్వా ఓషధయః సం విదానా ఇదం మే ప్రాఽవతా వచః॥ ఉచ్ఛుష్మా ఓషధీనాం గావో గోష్ఠాదివేరతే। ధనగ్ం సనిష్యన్తీనామాత్మానం తవ పూరుష॥ అతి విశ్వాః పరిష్ఠా స్తేన ఇవ వ్రజమక్రముః। ఓషధయః ప్రాఽచుచ్యవుర్యత్కిం చ తనువాగ్ం రపః॥ యా- [౨౬] స్త ఆతస్థురాత్మానం యా ఆవివిశుః పరుఃపరుః। తాస్తే యక్ష్మం వి బాధన్తాముగ్రో మధ్యమశీరివ॥ సాకం యక్ష్మ ప్ర పత శ్యేనేన కికిదీవినా। సాకం వాతస్య ధ్రాజ్యా సాకం నశ్య నిహాకయా॥ అశ్వావతీగ్ం సోమవతీమూర్జయన్తీముదోజసమ్। ఆ విత్సి సర్వా ఓషధీరస్మా అరిష్టతాతయే॥ యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః। బృహస్పతిప్రసూతాస్తా నో

ముఞ్చన్త్వగ్ంహసః॥ యా [౨౭] ఓషధయః సోమరాజ్ఞీః ప్రవిష్టాః పృథివీమను। తాసాం త్వమస్యుత్తమా ప్ర ణో జీవాతవే సువ॥ అవపతన్తీరవదన్దివ ఓషధయః పరి। యం జీవమశ్నవామహై న స రిష్యాతి పూరుషః॥ యాశ్చేదముపశృణ్వన్తి యాశ్చ దూరం పరాగతాః। ఇహ సంగత్య తాః సర్వా అస్మై సం దత్త భేషజమ్॥ మా వో రిషత్ఖనితా యస్మై చాఽహం ఖనామి వః। ద్విపచ్చతుష్పదస్మాకగ్ం సర్వమస్త్వనాతురమ్॥ ఓషధయః సం వదన్తే సోమేన సహ రాజ్ఞా। యస్మై కరోతి బ్రాహ్మణస్తగ్ం రాజన్ పారయామసి॥[౨౦]

*రపః పతత్రిణీర్యా అగ్ంహసో యాః ఖనామి వోఽష్టాదశ చ॥***4.2.6***॥*

మా నో హిగ్ంసీజ్జనితా యః పృథివ్యా యో వా దివగ్ం సత్యధర్మా జజాన। యశ్చాఽపశ్చన్ద్రా బృహతీర్జజాన కస్మై దేవాయ హవిషా విధేమ॥ అభ్యావర్తస్వ పృథివి యజ్ఞేన పయసా సహ। వపాం తే అగ్నిరిషితోఽవ సర్పతు॥ అగ్నే యత్తే శుక్రం యచ్చన్ద్రం యత్ పూతం యద్యజ్ఞియమ్। తద్దేవేభ్యో భరామసి॥ ఇషమూర్జమహమిత ఆ [౨౯] దద ఋతస్య ధామ్నో అమృతస్య యోనేః। ఆ నో గోషు విశత్వౌషధీషు జహామి సేదిమనిరామమీవామ్॥ అగ్నే తవ శ్రవో వయో మహి భ్రాజన్త్యర్చయో విభావసో। బృహద్భానో శవసా వాజముక్థ్యం దధాసి దాశుషే కవే॥ ఇరజ్యన్నగ్నే ప్రథయస్వ జన్తుభిరస్మే రాయో అమర్త్య। స దర్శతస్య వపుషో వి రాజసి పృణక్షి సానసిగ్ం రయిమ్॥ ఊర్జో నపాజ్జాతవేదః సుశస్తిభిర్మన్దస్వ [30] ధీతిభిర్హితః। త్వే ఇషః సం దధుర్భూరిరేతసశ్చిత్రోతయో వామజాతాః॥ పావకవర్చాః శుక్రవర్చా అనూనవర్చా ఉదియర్షి భానునా। పుత్రః పితరా విచరన్నుపాఽవస్యుభే పృణక్షి రోదసీ॥ ఋతావానం మహిషం విశ్వచర్షణిమగ్నిగ్ం సుమ్నాయ దధిరే పురో జనాః। శ్రుత్కర్ణగ్ం సప్రథస్తమం త్వా గిరా దైవ్యం మానుషా యుగా॥ నిష్కర్తారమధ్వరస్య ప్రచేతసం క్షయన్తగ్ం రాధసే మహే। రాతిం భృగూణాముశిజం కవిక్రతుం పృణక్షి సానసిగ్ం [30] రయిమ్॥ చితః స్థ

పరిచిత ఊర్ధ్వచితః శ్రయధ్వం తయా దేవతయాఽఙ్గిరస్వద్ధ్రువాః సీదత॥ ఆ ప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణియమ్। భవా వాజస్య సంగథే॥ సం తే పయాగ్ంసి సము యన్తు వాజాః సం వృష్ణియాన్యభిమాతిషాహః। ఆప్యాయమానో అమృతాయ సోమ దివి శ్రవాగ్ స్యుత్తమాని ధిష్వ॥[౩౨]

*ఆ మన్దస్వ సనసిమేకాన్న చత్వారిగ్ంశచ్చ॥***4.2.7**॥

అభ్యస్థాద్విశ్వాః పృతనా అరాతీస్తదగ్నిరాహ తదు సోమ ఆహ। బృహస్పతిః సవితా తన్మ ఆహ పూషా మాఽధాథ్సుకృతస్య లోకే॥ యదక్రన్దః ప్రథమం జాయమాన ఉద్యన్థ్సముద్రాదుత వా పురీషాత్। శ్యేనస్య పక్షాహరిణస్య బాహూ ఉపస్తుతం జనిమ తత్తే అర్వన్॥ అపాం పృష్ఠమసి యోనిరగ్నేః సముద్రమభితః పిన్వమానమ్। వర్ధమానం మహ [33] ఆ చ పుష్కరం దివో మాత్రయా వరిణా ప్రథస్వ॥ బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాద్వి సీమతః సురుచో వేన ఆవః। స బుధ్నియా ఉపమా అస్య విష్ఠాః సతశ్చ యోనిమసతశ్చ వివః॥ హిరణ్యగర్భః సమవర్తతాఽగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్। స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥ ద్రప్సశ్చస్కన్ద పృథివీమను [౩౪] ద్యామిమం చ యోనిమను యశ్చ పూర్వః। తృతీయం యోనిమను సంచరన్తం ద్రప్సం జుహోమ్యను సప్త హోత్రాః॥ నమో అస్తు సర్పేభ్యో యే కే చ పృథివీమను। యే అన్తరిక్షే యే దివి తేభ్యః సర్పేభ్యో నమః॥ యేఽదో రోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు। యేషామప్సు సదః కృతం తేభ్యః సర్పేభ్యో నమః॥ యా ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీగ్ంరను। యే వాఽవటేషు శేరతే తేభ్యః సర్పేభ్యో నమః॥ [౩౫]

*మహోఽను యతుధానానామేకాదశ చ॥***4.2.8**॥

ధ్రువాఽసి ధరుణాఽస్తృతా విశ్వకర్మణా సుకృతా। మా త్వా సముద్ర ఉద్వధీన్మా సుపర్ణోఽవ్యథమానా పృథివీం దృగ్ంహ॥ ప్రజాపతిస్త్వా సాదయతు పృథివ్యాః పృష్ఠే వ్యచస్వతీం ప్రథస్వతీం ప్రథోఽసి పృథివ్యసి భూరసి భూమిరస్యదితిరసి విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ పృథివీం యచ్ఛ పృథివీం దృగ్ంహ పృథివీం మా హిగ్ంసీర్విశ్వస్మై ప్రాణాయాఽపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై [౩౬] చరిత్రాయాఽగ్నిస్త్వాఽభి పాతు మహ్యా స్వస్త్యా ఛర్దిషా శంతమేన తయా దేవతయాఽఙ్గిరస్వద్ధ్రువా సీద॥ కాణ్డాత్కాణ్డాత్ ప్రరోహన్తీ పరుషః పరుషః పరి। ఏవా నో దూర్వే ప్ర తను సహస్రేణ శతేన చ॥ యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి। తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్॥ అషాఢాఽసి సహమానా సహస్వారాఽతీః సహస్వాఽరాతీయతః సహస్వ పృతనాః సహస్వ పృతన్యతః। సహస్రవీర్యా [౩౭] ఽసి సా మా జిన్వ॥ మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః। మాధ్వీర్నః సన్త్వోషధీః॥ మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌరస్తు నః పితా॥ మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తు నః॥ మహీ ద్యౌః పృథివీ చ న ఇమం యజ్ఞం మిమిక్షతామ్। పిపృతాం నో భరీమభిః॥ తద్విష్ణోః పరమం [౩౦] పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥ ధ్రువాఽసి పృథివి సహస్వ పృతన్యతః। స్యూతా దేవేభిరమృతేనాఽఽగాః॥ యాస్తే అగ్నే సూర్యే రుచ ఉద్యతో దివమాతన్వన్తి రశ్మిభిః। తాభిః సర్వాభీ రుచే జనాయ నస్కృధి॥ యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః। ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే॥ విరాడ్ [౩౯] జ్యోతిరధారయథ్సమ్రాడ్జ్యోతిరధారయథ్స్వరాడ్జ్యోతిరధారయత్॥ అగ్నే యుక్ష్వా హి యే తవాఽశ్వాసో దేవ సాధవః। అరం వహన్త్యాశవః॥ యుక్ష్వా హి దేవహూతమాగ్ం అశ్వాగ్ం అగ్నే రథీరివ। ని హోతా పూర్వ్యః సదః॥ ద్రప్సశ్చస్కన్ద పృథివీమను ద్యామిమం చ యోనిమను యశ్చ పూర్వః। తృతీయం యోనిమను సంచరన్తం ద్రప్సం జుహోమ్యను

సప్త [౪౦] హోత్రాః॥ అభూదిదం విశ్వస్య భువనస్య వాజినమగ్నేర్వైశ్వానరస్య చ। అగ్నిర్జ్యోతిషా జ్యోతిష్మాన్ రుక్మో వర్చసా వర్చస్వాన్॥ ఋచే త్వా రుచే త్వా సమిథ్స్రవన్తి సరితో న ధేనాః। అన్తర్హృదా మనసా పూయమానాః॥ ఘృతస్య ధారా అభి చాకశీమి। హిరణ్యయో వేతసో మధ్య ఆసామ్॥ తస్మిన్థ్సుపర్ణో మధుకృత్కులాయీ భజన్నాస్తే మధు దేవతాభ్యః। తస్యాऽऽసతే హరయః సప్త తీరే స్వధాం దుహానా అమృతస్య ధారామ్॥[౪౧]

*ప్రతిష్ఠాయై సహస్రవీర్యా పరమం విరాట్థ్సప్త తీరే చత్వారి చ॥***4.2.9**॥

ఆదిత్యం గర్భం పయసా సమఙ్ధ్సహస్రస్య ప్రతిమాం విశ్వరూపమ్। పరి వృఙ్గ్ధి హరసా మాऽభి మృక్షః శతాయుషం కృణుహి చీయమానః॥ ఇమం మా హిగ్ంసీర్ద్విపాదం పశూనాగ్ం సహస్రాక్ష మేధ ఆ చీయమానః। మయుమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తనువో ని షీద॥ వాతస్య ధ్రాజిం వరుణస్య నాభిమశ్వం జజ్ఞానగ్ం సరిరస్య మధ్యే। శిశుం నదీనాగ్ం హరిమద్రిబుద్ధమగ్నే మా హిగ్ంసీః [౪౨] పరమే వ్యోమన్॥ ఇమం మా హిగ్ంసీరేకశఫం పశూనాం కనిక్రదం వాజినం వాజినేషు। గౌరమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తనువో ని షీద॥ అజస్రమిన్దుమరుషం భురణ్యుమగ్నిమీడే పూర్వచిత్తౌ నమోభిః। స పర్వభిర్ఋతుశః కల్పమానో గాం మా హిగ్ంసీరదితిం విరాజమ్॥ ఇమగ్ం సముద్రగ్ం శతధారముథ్సం వ్యచ్యమానం భువనస్య మధ్యే। ఘృతం దుహానామదితిం జనాయాऽగ్నే మా [౪౩] హిగ్ంసీః పరమే వ్యోమన్న్। గవయమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తనువో ని షీద॥ వరూత్రిం త్వష్టుర్వరుణస్య నాభిమవిం జజ్ఞానాగ్ం రజసః పరస్మాత్। మహీగ్ం సాహస్రీమసురస్య మాయామగ్నే మా హిగ్ంసీః పరమే వ్యోమన్న్॥ ఇమామూర్ణాయుం వరుణస్య మాయాం త్వచం పశూనాం ద్విపదాం చతుష్పదామ్। త్వష్టుః ప్రజానాం ప్రథమం జనిత్రమగ్నే మా హిగ్ంసీః పరమే వ్యోమన్న్। ఉష్ట్రమారణ్యమను [౪౪] తే దిశామి తేన చిన్వానస్తనువో ని షీద॥ యో అగ్నిరగ్నేస్తపసోऽధి జాతః శోచాత్పృథివ్యా ఉత

వా దివస్పరి। యేన ప్రజా విశ్వకర్మా వ్యానట్తమగ్నే హేడః పరి తే వృణక్తు॥ అజా హ్యగ్నేరజనిష్ట గర్భాత్సా వా అపశ్యజ్జనితారమగ్రే। తయా రోహమాయన్నుప మేధ్యాసః తయా దేవా దేవతామగ్ర ఆయన్న్। శరభమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తనువో ని షీద॥[౪౫]

*అగ్నే మా హిగ్ంసీరగ్నే మోష్ట్రమారణ్యమను శరభన్నవ చ॥**4.2.10**॥*

*ఆదిత్య మిమం ద్విపాదం మయుం వాతస్యాఽశ్వమిమమేకశఫం గౌరమజస్రం గవయంవరూత్రిమవిమిమామూర్ణాయుముష్ట్రం యో అగ్నిరగ్నేః శరభమ్॥*

ఇన్ద్రాగ్నీ రోచనా దివః పరి వాజేషు భూషథః। తద్వాం చేతి ప్ర వీర్యమ్॥ శ్నథద్వృత్రముత సనోతి వాజమిన్ద్రా యో అగ్నీ సహురీ సపర్యాత్। ఇరజ్యన్తా వసవ్యస్య భూరేః సహస్తమా సహసా వాజయన్తా॥ ప్ర చర్షణిభ్యః పృతనా హవేషు ప్ర పృథివ్యా రిరిచాథే దివశ్చ। ప్ర సిన్ధుభ్యః ప్ర గిరిభ్యో మహిత్వా ప్రేన్ద్రాగ్నీ విశ్వా భువనాఽత్యన్యా॥ మరుతో యస్య హి [౪౬] క్షయే పాథా దివో విమహసః। స సుగోపాతమో జనః॥ యజ్ఞైర్వా యజ్ఞవాహసో విప్రస్య వా మతీనామ్। మరుతః శృణుతా హవమ్॥ శ్రియసే కం భానుభిః సం మిమిక్షిరే తే రశ్మిభిస్త ఋక్వభిః సుఖాదయః। తే వాశీమన్త ఇష్మిణో అభీరవో విద్రే ప్రియస్య మారుతస్య ధామ్నః॥ అవ తే హేడ ఉదుత్తమమ్। కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదావృధః సఖా। కయా శచిష్ఠయా వృతా॥[౪౭] కో అద్య యుఙ్క్తే ధురి గా ఋతస్య శిమీవతో భామినో దుర్హృణాయూన్। ఆసన్నిషూన్ హృత్స్వసో మయోభూన్ య ఏషాం భృత్యామృణధత్స జీవాత్॥ అగ్నే నయాఽఽ దేవానాగ్ం శం నో భవన్తు వాజేవాజే। అప్స్వగ్నే సధిష్టవ సౌషధీరను రుధ్యసే। గర్భే సఞ్జాయసే పునః॥ వృషా సోమ ద్యుమాగ్ం అసి వృషా దేవ వృషవ్రతః। వృషా ధర్మాణి దధిషే॥ ఇమం మే వరుణ తత్త్వా యామి త్వం నో అగ్నే స త్వం నో అగ్నే॥[౪౮]

హి వృతా మ ఏకాదశ చ॥**4.2.11**॥

విష్ణోః క్రమోఽసి దివస్పర్యన్నపతేఽపేత సమితం యా జాతా మా నో హిగ్ంసీదభ్యస్థాద్ధ్రువాఽస్యాదిత్యం గర్భమిన్ద్రాగ్నీ రోచనైకాదశ॥**11**॥

విష్ణోరస్మిన్ హవ్యేతి త్వాఽహం ధీతిభిర్ హోత్రా అష్టాచత్వారిగ్ంశత్॥**48**॥

విష్ణోః క్రమోఽసి త్వన్నో అగ్నే స త్వన్నో అగ్నే॥

॥హరిః ఓమ్॥

॥శ్రీ కృష్ణార్పణమస్తు॥

॥ఇతి చతుర్థకాణ్డే ద్వితీయః ప్రశ్నః॥

# కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితా

## ॥ అథ చతుర్థ కాణ్డే తృతీయః ప్రశ్నః॥

హరిః ఓమ్॥ అపాం త్వేమన్త్సాదయామ్యపాం త్వోద్మన్త్సాదయామ్యపాం త్వా భస్మన్త్సాదయామ్యపాం త్వా జ్యోతిషి సాదయామ్యపాం త్వాఽయనే సాదయామ్యర్ణవే సదనే సీద సముద్రే సదనే సీద సలిలే సదనే సీదాఽపాంక్షయే సీదాఽపాగ్ం సధిషి సీదాఽపాం త్వా సదనే సాదయామ్యపాం త్వా సధస్థే సాదయామ్యపాం త్వా పురీషే సాదయామ్యపాం త్వా యోనౌ సాదయామ్యపాం త్వా పాథసి సాదయామి గాయత్రీ ఛన్దస్త్రిష్టుప్ఛన్దో జగతీ ఛన్దోఽనుష్టుప్ఛన్దః పఙ్క్తిశ్ఛన్దః॥[౧]

*యోనౌ పఞ్చదశ చ॥4.3.1॥*

అయం పురో భువస్తస్య ప్రాణో భౌవాయనో వసన్తః ప్రాణాయనో గాయత్రీ వాసన్తీ గాయత్రియై గాయత్రం గాయత్రాదుపాగ్ంశు రుపాగ్ంశో స్త్రివృత్త్రివృతో రథన్తరగ్ం రథన్తరాద్వసిష్ఠ ఋషిః ప్రజాపతిగృహీతయా త్వయా ప్రాణం గృహ్ణామి ప్రజాభ్యోఽయం దక్షిణా విశ్వకర్మా తస్య మనో వైశ్వకర్మణం గ్రీష్మో మానసస్త్రిష్టుగ్గ్రైష్మీ త్రిష్టుభ ఐడమైడాదన్తర్యామోఽన్తర్యామాత్పఞ్చదశః పఞ్చదశాద్బృహద్బృహతో భరద్వాజ ఋషిః ప్రజాపతిగృహీతయా త్వయా మనో
[౨] గృహ్ణామి ప్రజాభ్యో ఽయం పశ్చాద్విశ్వవ్యచాస్తస్య చక్షుర్వైశ్వవ్యచసం

వర్షాణి చాక్షుషాణి జగతీ వార్షీ జగత్యా ఋక్షమమృక్షమాచ్ఛుక్రః శుక్రాథ్సప్తదశః సప్తదశాద్వైరూపం వైరూపాద్విశ్వామిత్ర ఋషిః ప్రజాపతిగృహీతయా త్వయా చక్షుర్గృహ్ణామి ప్రజాభ్య ఇదముత్తరాథ్సువస్తస్య శ్రోత్రగ్ం సౌవగ్ం శరచ్ఛ్రౌత్ర్యనుష్టుప్శారద్యనుష్టుభః స్వారగ్గ్ స్వారాన్మన్థీ మన్థిన ఏకవిగ్ంశ ఏకవిగ్ంశాద్వైరాజం వైరాజాజ్జమదగ్నిర్ఋషిః ప్రజాపతిగృహీతయా [3] త్వయా శ్రోత్రం గృహ్ణామి ప్రజాభ్య ఇయముపరి మతిస్తస్యై వాఙ్మతీ హేమన్తో వాచ్యాయనః పఙ్క్తిర్హైమన్తీ పఙ్క్త్యై నిధనవన్నిధనవత ఆగ్రయణ ఆగ్రయణాత్త్రిణవత్రయస్త్రిగ్ంశౌ త్రిణవత్రయస్త్రిగ్ంశాభ్యాగ్ం శాక్వరరైవతే శాక్వరరైవతాభ్యాం విశ్వకర్మర్షిః ప్రజాపతిగృహీతయా త్వయా వాచం గృహ్ణామి ప్రజాభ్యః॥[४]

*త్వయా మనో జమదగ్నిర్ ఋషిః ప్రజాపతిగృహీతయా త్రిగ్ంశచ్చ*||**4.3.2**||

ప్రాచీ దిశాం వసన్త ఋతూనామగ్నిర్దేవతా బ్రహ్మ ద్రవిణం త్రివృథ్స్తోమః స ఉ పఞ్చదశవర్తనిస్త్ర్యవిర్వయః కృతమయానాం పురోవాతో వాతః సానగ ఋషిర్దక్షిణా దిశాం గ్రీష్మ ఋతూనామిన్ద్రో దేవతా క్షత్రం ద్రవిణం పఞ్చదశః స్తోమః స ఉ సప్తదశవర్తనిర్దిత్యవాడ్వయస్త్రేతాయానాం దక్షిణాద్వాతో వాతః సనాతన ఋషిః ప్రతీచీ దిశాం వర్షా ఋతూనాం విశ్వే దేవా దేవతా విడ్ [౫] ద్రవిణగ్ం సప్తదశః స్తోమః స ఉ ఏకవిగ్ంశవర్తనిస్త్రివథ్సో వయో ద్వాపరోఽయానాం పశ్చాద్వాతో వాతోఽహభూన ఋషిరుదీచీ దిశాగ్ం

